Approved by the T. B. C. Madras for Class use Vide Fort St. George Gazette. Part II. Page 108. Dated 13-5-53.

# వా సం తి క

( ఉపవాచకము )

4, 5, 6 ఫారములకు

'విద్వాన్'
దేవరకొండ చిన్నికృష్ణశర్మ,
ప్రధానాంధ్ర పండితుఁడు :
బిషప్ అజరయ్యా బాలికోన్నతపాఠశాల,
విజయవాడ.



ప్రకాశకులు :
వి. వెంకటేశ్వర & కో.,
కైకలూరు.
1953



రు. 1-0-0

# ప్రవేశిక.



ఈ చిన్ని నవల చరిత్రాత్మకము. వాసంతిక యను రసపుత్రబాలిక యద్భుతస్వార్థత్యాగ మిందు వర్ణితము. భారతదేశ చరిత్రలో రసపుత్రజాతి వీరవిహారగాథలు ప్రత్యేకస్థాన మలంకరించినవి. విద్యార్థికోటికి దేశభక్తి సముద్దీపింపఁ జేయు వీరరస గుళిక లివి. వాసంతిక దివ్యచరిత యట్టి వీరరసగుళికలలో నొకటి.

వినూత్నముగాఁ దెచ్చుకొన్న మన స్వాతంత్ర్యమును సుస్థిరమొనర్చు బాధ్యత భావిపౌరు లయిన విద్యార్థులపై నున్నది. వారట్టి బాధ్యత నిర్వహించుటకే వీరరసగుళికలు సంసేవ్యములు. రామాయణము, భారతము మున్నగు మహాకావ్యములున్నవిగదా! యని మనము సంతృప్తి పడరాదు. భారతదేశీయ కథాసాగరములోని యిట్టి రత్నముల నన్వేషించి తెచ్చి సానఁబట్టి, విజ్ఞానజ్యోతు లఖండముగాఁ బ్రకాశింపఁ జేయవలయును. నాఁడే కవులు చరితార్థులు. నాఁడే విద్యార్థులకు భారతభారతి సర్వాంగసుందరియై సాక్షాత్కరింపఁగలదు.

ఇట్టి గంభీరాశయముతో నీ 'వాసంతిక' ప్రకాశిత మగుచున్నది. విద్యాశాఖాధికారులు, పండిత కవులు, విద్యార్థులు, సహృదయులయిన పాఠకులు కావ్యపరమార్థము గుర్తించి యాదరించుటయే యీ రచనకుఁ బ్రతిఫలము.

ఇంకం జెప్పవలసినది కొంచె మున్నది. చరిత్రాత్మకము లయిన నవలలను రచించుటకు సంబంధించిన దిది. సంగ్రహముగా నున్న చిన్నకథను పెంచి వ్రాయుటలో సందర్భానుసారముగాం గొంత కల్పన యవసరము. కాని యీ కల్పన చరిత్ర ప్రసిద్ధ వ్యక్తుల గుణోన్నతిని భంగించునది కా రాదు. రచన రసవంతమై, సముద్దిష్టార్థము నుద్ఘాటింపం గలుగుటయే దాని పరమ ప్రయోజనము. స్థల కాల నిర్ణయాదిక మీమాంసలతోం బాఠకులను విసివించుట కవి పనికాదు. రసోదంచిత కవితా సుధా సృష్టియే యతని పని.

రసికసహృదయ హృదయము కవితా రసగ్రహణ నిపుణముగదా!

ఇట్లు,
ర చ యి త.

శ్రీ భాష్యాయ నమః

# వాసంతిక

## ౧

అది వైశాఖ మాసము. వసంతుఁడు వృక్షములను, లతలను, నేత్రపర్వముగా నలంకరించి కృతకృత్యుఁ డయ్యెను. మలయపవనము దక్షిణపుఁ గొండ సంతరించుకొన్న పరిమళములను జగమునకుఁ బంచిపెట్టుచు నలసినట్లుండెను. ప్రయాణాయాసమువలనఁ గాఁబోలును! అనిలము నిట్టూర్పుపుచ్చుచుండఁ గవోష్ణమై, యది భోగుల కించుక తాపహేతు వగుచుండెను. గర్భాలయమున మూఁడువందల యేఁబది యైదు దినములు గడపి, విసివి కానచ్చును; ఉత్సవ విగ్రహములు పురవీధుల నూరేగుట. ప్రియాసంయోగకారియైన తన్ను, నిర్దయుఁడై కాల్చివైచె నని, యనంగుఁడు రూపహీనుఁడైకూడఁ, బురారిపైఁ బగసాధింపఁగా; నవశుఁడై, యా మహేశ్వరుఁడు గంగాపార్వతుల నాశ్రయించెను. ఉగ్రుఁడైన యా శివుని నోర్పుమని తన మిత్రుఁడైన మన్మథునిఁ బ్రోత్సహించుటకో! యన, వసంతుఁడు చెఱకుగడలను విండ్లను, దుమ్మెద లనెడు గుణసముదాయములను, నలరు లనెడు నమ్ములను, గుప్పలు తిప్పలుగాఁ గూర్చి

పెట్టెను. మేనల్లుఁడైన యనంగునికి జయ మాకాంక్షించి, సుధా
కరుఁడు దివ్యాంశు లన్నఁ గొఱికి తినుచున్నను లక్ష్యపెట్టక,
యూరా లాఁగోలఁ జూపుచున్నదే వెన్నెలలు వెదచల్లి యల్లునికిఁ
దోఁహృదముచుండెను.

అది వైశాఖమాసమునాఁటి సాయంతనమున నొక యువ
కుఁడు చిత్తూరు నగరవీథిఁ జనుచుండెను. అతని యుడుపులవలన
నొక యుత్తమ వంశపుత్రుఁ డగు నని స్ఫురించుచుండెను. ఆతని
నడుమునఁ గట్టి కృష్ణసర్పాకారమై వ్రేలాడు కత్తియొఱవలన
నతఁడు వీరుఁ డగు నని స్పష్టమగుచుండెను. తలపాగకు దిగువ
గాలికిఁ దూఁగుచుంగురులు ముఖముపైఁ బరిభ్రమించుచుండఁ,
బద్మముపై మూఁగు కొదమ తుమ్మెదల మొత్తములఁ దలఁపించు
చుండెను. ప్రయాణశ్రమవలనఁ గపోలములందును, నుదుటి
యందును, బొడముచున్న స్వేదబిందువుల, నుత్తరీయాంచలమున
నొత్తుకొన్నప్పటి యతని ముఖమండలము మబ్బుతెర విడిచి,
బయటఁ బడిన చంద్రమండలమువలెఁ బ్రకాశించెను. సమీప
గతులయిన పౌరు లతనికి నమస్కరించి, కుశలప్రశ్నము లొనర్చు
చుండుటచే, నతఁడు చిత్తూరికిఁ గ్రొత్తవాఁడు కాఁ డని తెల్ల
మగుచుండెను.

ఆ వీరయువకుఁ డిట్లు కొంతదూర మరిగి, యొక సౌధ
ప్రాంగణమున నాఁగెను. అతని చూపు లతఁ డట నెవరికొఱకో
నిరీక్షించుచున్నట్లుండెను. ఆ సౌధమున కెదురుగా నించుక
యెడమున రాజవీథికి రెండవదెస నొకకుటీర మున్నది. ఆ కుటీ
రమునకు ముందటిభాగమున వివిధములగు పూలమొక్కలు

మనోహరములై మనసిజుని యమ్ములపొదులవలె నలరారు చున్నవి. కుటీర ప్రాంగణము పరిశుభ్రమై పాలువోసి యెత్తఁ దగియున్నది. ఆరామ రామణీయకత యా కుటీరనివాసుల రసజ్ఞత ప్రకటిత మొనర్చుచుండెను. ఘన యువకుని దృష్టి యీ కుటీర ముపైఁ బ్రసరించెను.

ఇంతలో "రసాలు-,రసా" లనుచు మామిడిపండ్లమ్ము వాఁ డొకఁ డచ్చటికి వచ్చుచుండెను. కుటీరములోనుండి పదు నాలేండ్ల బాల యొకర్తుక వచ్చెను. పండ్లవాఁ డామెను జూచి "అమ్మగారూ! మంచి పండ్లున్నవి. కావలెనా!''యని ప్రశ్నించెను.

ఆ బాల యతనిమాటలు విని యధిక్షేపణముగా,''నీవెప్పుడిట్లే యందువు. నిన్నటి పండ్లలో నొక్కటియును మంచిదికాదు. అవి రసాలు కావు. నీరసాలే. రసా లన్నచో మా నాయనకు మిక్కిలి యిష్టము. బోలెడు సొమ్మిచ్చి కొనుటయే కాని యాయన కింపైన ఫలము లింతవఱకు లభ్యము కాలేదు.'' అని, యెదుట నొకయువకుఁడు తన్ను తెప్పవ్రాల్పక చూచుట గమనించి, లజ్జాన్వితయై, 'లోనికి రావయ్యా! మా నాయనగారు చూచి తీసికొందు' రని యింటిలోనికి మఱలిపోయెను. పండ్లవాఁ డామె వెంటఁ గుటీరము లోనికిఁ బోయెను.

యువకుఁ డామె రూపలావణ్యముల కాశ్చర్యపడెను. ఒక మెఱపు తీఁగె సాక్షాత్కరించి, తనకుఁ గనులు మిఱుమిట్లు గొల్పి, తాను గన్నులు నులిమికొని చూచునంతలో నదృశ్యమైనది. లీలగా నామె తనూవిలాసము మనఃఫలకమున ముద్రిత

మైనది. కూర్పాసమువంటి వలిపెపువలువ మాటుననుండి యామె నెమ్మేని పసిఁడికాంతులు ప్రసరించుచు, నామె యున్నత కులాలంకార కావచ్చునని సూచించుచుండెను. తీర్చినట్లున్న కనుబొమలు, విశాలములైన తరళనయనములు, లవలీదళములఁ దలఁపించు కపోలములు, సంపెఁగవంటి నాసిక, బింబఫలమువంటి యధరము, మల్లెమొగ్గలవంటి పలువరుసయుఁ గల యామెముఖచంద్రమండల మింకను గన్నులఁ గట్టినట్లుండెను. కోకిలస్వరమువంటి యామె మధురస్వర మింకను వినిపించుచున్నట్లుండెను. వెనుదిరిగినప్పటి యామె వినీల కేశబంధములో నతని మనస్సు గూడ బంధింపఁబడి నట్లుండెను. కుసుమ సుకుమారమైన యీ తన్వంగిలావణ్య మన్వారికిఁ బ్రాప్తము కానున్నదో! యనుకొనెను.

ఇంతలోఁ గుటీరమున కెదురుగాఁ గల సౌధమునుండి యువకుఁ డొకఁడు వెలుపలికి వచ్చెను. అతఁడు వీధిలోనున్న మొదటి యువకునిఁ జూచి 'ఓహో! రామసింహా! ఎప్పుడు రాక? లోనికిఁ బోదము రా! నీతోఁ జాల మాటలాడవలసి యున్న' దని యతనిని వెంటఁబెట్టుకొని సౌధాంతర్భాగమునకుఁ బోయెను.

ఆ సౌధము రమణీయము. సిద్ధహస్తులైన శిల్పుల కళానైపుణ్య మందు హృదయాహ్లాదకరముగ విరాజిల్లుచుండెను. కుడ్యములపై విశేషవర్ణసమ్మేళన మింపుగాఁ బొసఁగ లిఖింపఁబడిన దృశ్యము లవి, చూపఱ నే దివ్యలోకములకో కొంపోవఁ జాలి యుండెను. ప్రతి గదియందును, ధనుర్బాణములుఁ, గృపాణములుఁ, గుడ్యములకుఁ దగిలింపఁబడి, నిద్రాణములైన నాగేంద్రముల వలెఁ గన్పట్టుచుండెను. రామాయణ మహాభారతములలోని

వీరరస ప్రధానఘట్టములు నైపుణ్యము మీఱఁ జిత్రింపఁబడిన చిత్రపటము లనేకము లచటఁ బ్రేక్షకులకు వీరోత్సాహముఁ బురిగొల్పఁజాలియుండెను. వైదేశిక ప్రభువుల నెదిర్చి, మాతృదేశ స్వాతంత్ర్యము సంరక్షించుటకై, జీవితములను దృణప్రాయముగా సర్పించిన సంగ్రామసింహాదులరూపపటము లనేకము లచట నలంకృతములై యుండెను.

యువకు లిర్వురుఁ గక్ష్యాంతరములు గడచి సౌధాగ్రమందు సముచితాసనములలంకరించి యిట్లు ప్రసంగమారంభించిరి.

"రామసింహా! ఢిల్లీకిఁ బోయివచ్చితివి కాఁబోలు! అచటి విశేషము లేమి?"

"కుమారసింహా! ఔరంగజీబు నానాఁటికి దయాశూన్యుఁడగుచున్నాఁడు. రాజ్యకాంక్షచేఁ జేసిన రక్తపాతము చాలదా! చేఁ జిక్కిన ముదుసలి తండ్రి నతఁ డెంత హింసించుచున్నదియు విన్న గుండె నీరగును. ఆ వృద్ధరాజు కనాఁడు సమీపగతుఁడైన సేవకునితోఁ దన ప్రియ పుత్రుఁడైన దారా సుగుణములఁ దలఁచుకొని విలపించెనఁట! ఆ సేవకుఁడును సజ్జనుఁడే. అతఁడు చక్రవర్తితోఁబాటు దుఃఖించుచు దారా సద్గుణములను గీర్తించెనట! మఱునాఁటి కాసేవకుఁ డేమయ్యెనో! యెవ్వరికిని దెలియదు. ముసలి రాజునొద్ద కొక క్రొత్త సేవకుఁడు పంపఁబడెను. వాఁడు నోరువిప్పి మాటలాడఁడు. ఆ యా నిర్ణీతసమయములందుఁ దన కర్తవ్యము నిర్వహించుచుండును. పరిచారకశతములచేఁ బరివేష్టింపఁబడిన షాజహాను చక్రవర్తి కినేఁడు మనసిచ్చి మాటలాడు

వ్యక్తి కైదీ యయ్యెను. ఆవృద్ధుఁడు తనలోఁ దాను గుమిలిపోవల యునే కాని సమాశ్వసించువారు లేరు."

"పూర్వసేవకుఁ డేమయ్యెనందువు?"

"ఏమౌను! పరలోకమునకుఁ బంపఁబడి యుండును."

"రామసింహా! పిచ్చుకమీఁద బ్రహ్మాస్త్ర మన్నట్లు దిక్కు-మాలిన సేవకునిపైనా యౌరంగజీబు ప్రతాపము! అయినను వాఁడేమి చేసెను? పుత్త్రశోకపీడితుఁడైన వృద్ధరాజు నోదార్చెను. అంతేకదా!"

"దీనికే యాశ్చర్యపడుచున్నావు. జహానారా రోషనారా నేదో యాక్షేపణ మొనర్చినదఁట! రోషనారాసంగతి నీ వెఱుఁగుదువుగదా! కుటిల పన్నగము. ఆ వక్రమతి దుర్వర్తన మారసి తనకుఁ జెల్లెలుగనుక జహానారా హితోపదేశ మొనర్చినది. రోషనారా యందులకు మండిపడినది. పోయి యౌరంగజీబుతో గుసగుసలాడినది. ఫలితమేమో వింటివా! జహానారా తండ్రిని దర్శించుటకు యథేచ్ఛముగాఁ బోరాదని నిర్బంధ మొనర్పఁబడెను. ఆమె ప్రాణేశ్వరుఁ డొక యర్ధరాత్రమున హత్యగావింపఁబడెను."

"ఏమేమీ? బావమఱఁదిని జంపించినాఁడా!"

"తల్లి చెవులను ద్రెంచినవానికిఁ బినతల్లి చెవులు బీఱపూవులును గావఁట! తోడబుట్టువులైన యన్నదమ్ములను జంపించిన వాఁడు తోఁడబుట్టినదాని పెనిమిటిని జంపించుటకు వెనుదీయునా!"

"కాఁబట్టి యౌరంగజీబు హైందవులకు మాత్రమే పగవాఁడు కాఁడు."

"నిజము! నిజము! హైందవుల నణఁగఁద్రొక్కుటకై మహామ్మదీయులలో మతోద్రేకముఁ బ్రోత్సహించును. మఱల మహామ్మదీయులలోనే షియాల నణఁచుటకు సున్నీలను బురిగొల్పును. ఇంకఁ దన యభ్యుదయమున కాటంకమగునని యెవనిఁ గూర్చి తాను భావించునో వాఁడు హిందువుడే కానిమ్ము! మహామ్మదీయుఁడే కానిమ్ము! స్వకీయమైన సున్నీశాఖవాడు కానిమ్ము! తన కాప్తబంధువే కానిమ్ము! వాని రక్తముఁ జూచికాని, కనుమూయనివాఁ డతఁడు. మురాదు నెట్లు లోఁబఱచుకొనెనో! మన మెఱుఁగమా! దారా హైందవ పక్షపాతియఁట! తా నిస్లాముమత వ్యాప్తిమాత్రమే కాంక్షించెనఁట! మురాదే చక్రవర్తి లక్షణ లక్షితుఁడై యుండెనఁట! ఇట్లు చెప్పి మురాదుసాయముఁ బడసి దారానోడించి చంపినపిమ్మట మురాదును ముద్దుఁబెట్టుకొన్నాఁడా! విషాన్నముఁ బెట్టించి చంపించినాఁడు గదా! అతనికిఁ గావలసిన దెంతవఱకు నధికారము, స్వాతిశయ ప్రకటనము మాత్రమే." ఇటీవల నతఁ "డెచ్చటనో దేవాలయ మొకటి కూలఁద్రోయించి, దేవవిగ్రహములు సోపానములుగాఁజేసి మసీదొకటి కట్టింపఁదలఁచెనని వింటిని. అది యధర్మమనియుఁ గరుణించి యాకార్యము విరమింపవలసినదనియు, నతనిని బ్రార్థించుటకు విద్వాంసులు కొందఱు వచ్చిరఁట కదా! అతఁడు వారిప్రార్థన మంగీకరించినాఁడా!"

"ఆహా! వారికిఁక నిహలోకమున మఱి యెట్టికామ్యమును గలుగకుండునట్లు చేసినాఁడు."

"అనఁగా వారిని జంపించినాఁ డనియా నీ తాత్పర్యము!"

"ఊరకే చంపించినను నంతచింత కలుగదు. వారి నందఱిని ఢిల్లీ పుర

వీథిలోఁ బంధుకొనఁ జేసి మదపు టేనుఁగులచేఁ ద్రొక్కించి చంపించెను.”

“రామసింహా! తైమూరు చెంగిస్ఖానుల క్రౌర్య మంతయు నితనిలో మేళవించి నట్లున్నదే!”

“సందేహమేమి? మొగలురాజ్యస్థాపకుఁడు బేబ రెవఁడు? నీవు పేర్కొన్న యీ యిర్వురిరక్తముఁ దనయందుఁ బ్రవహించుచున్నవాఁడే కదా! కాని యతనికైనను వారిపరాక్రమమే యబ్బినదికాని క్రౌర్యమబ్బలేదు. నేఁ డది యితనిలో మూర్తీభవించినది. కషాయము కలకాలము నాఁటిదే. పాత్రభేదము మాత్రమే గోచరించుచున్నది.”

“మహారాష్ట్రమున శివాజీ విజృంభించుచున్నాఁడఁట కదా! అతఁడును రాణాయు రెండుదెసల నొత్తిన మొగలుప్రభుత్వము నవసిపోకుండునా!”

“దైవముకూడఁ గలసి రావలయును. నూట యేఁబది యేండ్లు దాదాపుగా మొగలుల యాధిపత్యమిటఁ జెల్లుచున్నది. వేళ్లువాఱియున్న పారతంత్ర్య విషవృక్ష మంత సులభముగాఁ గూలదు. ఒక రెమ్మయో, కొమ్మయో, విఱిగినంత మాత్రమున నేమగును?”

“పదిమంది పదికొమ్మలు నఱికినఁ జెట్టు మ్రోడుకాదా! మ్రోడెన్నాళ్ళు బ్రదుకఁగలదు?”

“ఈచెట్టు అక్కిన చెట్టయ్యా స్వామీ! నీవు కొమ్మలు నఱికివేయుటే కాక ప్రకాండముగూడఁ ద్రెంచివేసినను నిది

చావదు. మఱల నిట్టె తలయెత్తును. ప్రతాపసింహుల విక్రమము సామాన్యమా! జీవితాంతమువఱకు నెత్తిన కత్తి డింపక పోరాడిరి గదా! అంత పరిశ్రమించి వారొక కొమ్మ నఱికిరి. మఱలఁ గ్రొత్తకొమ్మలెన్ని యుదయించినవో చూడు."

"ఔనౌను. పతనముగలుగకుండఁగనే యుండవలయును. కలిగిన పిమ్మట నధోగతికిఁ బరిమితియున్నదా! సంగ్రామసింహులు పూరించిన స్వాతంత్ర్య శంఖారావము రాజపుత్రస్థానమున నింకను బ్రతిధ్వనించుచునే యున్నది. అట్లయ్యును రాజపుత్రులలో నందఱును స్వతంత్రత నభిలషించుచున్నారా! ఎందఱురాజపుత్త్రులు మొగలుల కొలువు సేయుటలేదు? ఎందఱు రసపుత్త్రరాజు లతని కంకితులగుటలేదు? నేఁడో! రేపో! రూపనగరమతని హస్తగతము కానున్నది."

"రూపనగరమా! అదియెట్లు?"

"ఉదయపురి స్వభావము నీకుఁ దెలియదా!"

"అది రోషనార తరువాత రోషనార యంతటిది. ఆ దుర్మార్గురా లిప్పుడేమి తలపెట్టినది?"

"ఈ నడుమ నుదయపురికిఁ గూర్చు బందుగొకఁడు రూపనగరమునకు వచ్చినాఁడు. వాఁడు మీ చెల్లెలు విమలను జూచి నీవుకూడ నుదయపురివలె నౌరంగజేబును బెండ్లాడిన మహాభోగము లనుభవింపఁ గల వన్నాఁడఁట! అందుపై మీ చెల్లెలు కోపోద్దీపితయై, వానిని, వాని బందుగురాలిని, దాని భర్తను నిశితముగా విమర్శించినదఁట!"

"ఇంకేమి? ఆ బంధువు మూట గట్టుకొనిపోయి యీ సమాచార ముదయపురికిఁ జేర్చియుండును."

"అంతే జరిగినది. ఉదయపురి దానికిఁ జిలువలుఁ బలు వలుఁ గల్పించి యౌరంగజీబునకుఁ జెప్పినది."

"అంతమాత్రముననే యౌరంగజీబు యుద్ధప్రయత్నము లొనరించు చున్నాఁడా!"

"పర రాజ్యాక్రమణముననే సమయముఁ బ్రతీక్షించు చున్న యతనికీ నెపము చాలదా! నీవొక యూహతోఁ బోసిన నేనొక యూహతోఁ బ్రాపు చున్నానన్న ట్లుదయపురి యొక స్వార్థముతో రూపనగరముపై దండెత్తుటకుఁ బ్రోత్సహింపఁగా, నామెకుఁ దెలియని వేఱొక స్వార్థముతో నౌరంగజీ బందుల కంగీ కరింపఁ గలఁడు. కారణమేమైనను మనకిప్పు డపాయము సంభవింప నున్నది. ఎట్టి విపత్తునుండి మన సంస్థానమును, మహారాజును సంరక్షించుకొనఁ గలమో!"

"రామసింహా! రజపుత్ర చక్రవర్తి రాజసింహునకు, సోదర తుల్యుఁడనుగా మన్నింపఁ బడుచున్న నేనును, ప్రియమిత్రుఁడవైన నీవును, సాహాయ్య మర్థించితిమేని యాయన కాదనునా! మేవాడు వీరుల కెదురు నిలిచి ఢిల్లీ సైనికులు పోరాడఁగలరా! అయినను నా భిల్లపరివార మది ఢిల్లినుండి రూపనగరముఁ జేరునప్పటికి, ఢిల్లీ సైన్యములో ముప్పాతికవంతుఁ బొరిగొన కుండునా! హతశేషు లతో నౌరంగజీబు మనకుఁజిక్కి—పాదాక్రాంతుఁడు కాకపోవునా!"

పిమ్మట వారిరువురుఁ గొంతసేపు మౌన మవలంబించి యేమేమో చింతించు చుండిరి. కొంత తడవునకుఁ గుమారసిం

వాఁడు మేడ దిగి క్రిందికిఁ బోయెను. రామసింహుఁ డొక మాఱు కుటీరము దెసఁజూపులు నిగిడించెను. ఆ కుటీర ప్రాంగణమున నొక చంద్రమండలమును, మింటనొక చంద్రమండలమును నతనికి గోచరింపఁగా నతఁడు తారతమ్యములు విచారించుచు నాలోచనకుఁ జిక్కెను.



౨

“సోదె; అమ్మా! సోదె! సోదె; తల్లీ! సోదె.” యని యెఱుకత యొకతె రూపనగరమున రాజసౌధము దాపుననుండి పోవుచు నెవ్వరైనఁ దన్నుఁ బిల్తురేమో! యను నాసచేఁ గాఁబోలు! మాటిమాటికి వెనుదిరిగి చూచుచు నడవలేక నడవలేక నడచుచుండెను. ఆమె తనూలావణ్యముఁ జూడ ముప్పది యేండ్లు కడచెనో కడవలేదో యున్నట్లుండెను. నిశిత దృష్టితో నామె ముఖలక్షణములఁ బరిశీలించినచో నామె యెఱుకత కాదని

యుఁ, గారణాంతరముల నావేష మూనెననియు స్ఫురింపక పోదు. కట్టినచీర ముదుకయయ్యెను, గుసుమ మృదులమైన యామె నెమ్మేని సౌకుమార్యచ్ఛాయ లవి, యా వనిత యెవ్వతయో, నిన్నటిదనుక మహాభోగము లనుభవించు నట్టిదే యను నూహా పొడమఁజేయును. పల్లవమృదులములైన యామె కరాంగుళులఁ బరికించి చూడఁగా, గత దినములవఱకు నంగుళీయకములు ధరించిన గ్లోరవల్లు గానవచ్చు చుండెను. కాని వేషభాషలవలన నామె యచ్చముగా నెఱుకత వలెనే యుండెను.

ఆమెకు రాజ సౌధమున సోదెచెప్పి బహుమతు లందుకొనకుండఁ బోవుట యిచ్ఛగింపకున్నట్లున్నది. అందువలన సింహద్వార సమీపమునుండి "సోదె తల్లీ! సోదె. సోదె అమ్మా! సోదె. జరుగఁబోవు మేలు సత్తెముగఁ జెప్పఁగలను." అని యఱచుచుండెను. ద్వారపాలకు లామెను జూచి "ఓసీ! ఏఁటి కట్లు గొంతు బొంగుఱువోవ నఱచెదవు? మఱియొక చోటికిఁ బో! ఇచట నీ మొఱ నెవ్వ రాలించెదరు? ప్రొద్దుక్రుంకకమున్నె నాలుగిండ్లకుఁ బోయి సంపాదించుకో!" యనిరి. ఆమె వారినిఁ జూచి "అయ్యా! రాచవారి యీవి మఱియొకకడ నుండునా! నా మనవి విని నన్ను లోనికిఁ బోనిండు. మఱలి వచ్చునపుడు నాకు దొఱకిన దానిలో మీకు గొంత ముట్టఁజెప్పక పోవ"నని పలికెను. అంతట వా రామెనుజూచి "నీ పొట్టకు సంపాదించుకొన్న మాకుఁ బెట్టినట్లే. కాని లోనుండి సెలవువచ్చినఁ గాని నిన్ను మేము ప్రవేశపెట్టఁ గూడదు. మమ్ముల నేమి చేయుమందు" వనిరి.

ఈ సంవాద మాలించి కాంబోలు నా యావరణమునఁ దిరుగుచున్న యువతి యొకతె యచ్చటికి వచ్చి 'ఓసీ! సోదె సరిగాఁ జెప్పుదువా? కట్టు మొడిలో నైచుకొని పోయెదవా?' యని ప్రశ్నించెను. అందుల కా యెఱుకత 'ఓయమ్మ! నేనందటికి లాఁటిదాన ననుకొన్నా వేఁటి! మనసులోని తలఁపు, దేవతలదీవన అఱఁటి పండొలిచి, చేతఁ బెట్టినట్లు, నా సోదె. ఇంతెందుకు? చెప్పితేఁ దెలియదా? రా లోని' కని యామెకన్న ముందుగాఁ దానే లోపలికిఁ బోయెను.

యువతి యామెను సౌధమునకు వెనుక భాగమునఁ గడు దవ్వుగా నున్నయొక యుద్యానవనమునకుఁ దీసికొనిపోయెను. చేటలో ముత్తియములుపోసి, యొక సువర్ణముంచి యెఱుకత ముందు పెట్టించెను. అంతలో రాయంచవలె సవిలాసముగా, నడచుచుఁ, దా నడుగిడినచోటనెల్ల మెట్టతామరలు పొడమినట్లుండఁ, జెలికలతోఁ గూడి లతాంగి యొకతె యచ్చటికి వచ్చెను. ఎఱుకత యామెను జూచినంతనే శిరసున వ్రేళ్ళుంచి చిటుకు చిటుకున విఱచుచు 'మా తల్లి సాక్షాత్తు లచ్చి లాఁగేయున్నది. ఈ యమ్మ రారాజు పట్టపుదేవి కావలె. మా దేవత దీవన యట్లున్నది. విమలమ్మ కోరిక పండేగాని కాయగాదు. రా! తల్లీ! ఈ చేటముందు కూర్చుండు. ఈ బెత్తముఁ జేతఁ బట్టుకో!' యని కండ్లుమూసికొని యటునిటు నూఁగుచు నిష్టదేవతా ప్రార్థన మారంభించెను. చెలికత్తెలును రాజనందన పేరీమె యెట్లు చెప్పఁగలిగినదని, యాశ్చర్యపడి, 'యీమె మిక్కిలి మహిమగల' దనుకొనిరి. విమలయు విస్మితయై,యెఱుకతయెదుటఁగూర్చుండి, తదేక దీక్షగా నామెవంకఁ జూచుచుండెను.

ఎఱుకత కనులు తెఱవకయే విమలచేతికి బెత్త మందిచ్చి యుల్లాసగాన మారంభించెను.

“సిరిగలదానవే చిలుకల కొలికి!
వరగుణ కలితవే బంగారుబొమ్మ!
తల్లి! నీ పట్టిన దెల్ల బంగరువె!
పొల్లు వోదమ్మ! యీ బుల్లెమ్మ వాక్కు;
ముట్టిన వన్నియు ముత్యంబు లగునె!
మెట్టఁ బోదువు రాచమేడ నీ వతివ!
ఇన్నాళ్ళ నుండి నీ నెమరు చూచెదనె;
కన్నీళ్ళతోఁ జేయి కడుగుచున్నావె;
ఓయమ్మ! నీ కోర్కె తీయనితలఁపు
పాయక మనసులోఁ బర్వెలు వాఱు;
దాని వేడిమి కీవు తాళలేవైతి;
బోనమ్ము ముట్టవు; తానమాడవును;
వలువ మార్పవు; నెచ్చెలులుఁ బల్వ వినవు ;
తిలకమ్ము పెట్టవు; దిద్దవుకురులు;
పలుకరించిన వారిపైఁ గోపపడెదు;
చెలువ నీకే చింత వలవదేయింకఁ;
గాశీ విశాలాక్షి కరుణించె నిన్ను;
శ్రీశైల నాథుఁ డాశీర్వాద మిచ్చెఁ;
జెప్పనా! నీకోర్కెఁ జిత్రమ్ముగాఁగ
నొప్పుకొందునె! నిజమ్మొప్పులకుప్ప!”

'నిజముఁ జెప్పితే నొప్పుకోవా! చెప్పవే మమ్మా!'యని యెఱుకత పాట యాఁగి విమలను బ్రశ్నించెను. విమల చెలికత్తెలవంకఁ జూచెను. వా రాశ్చర్యపరవశ లైనట్లు వారి ముఖ లక్షణములు చెప్పుచుండెను. పాట యాగినంతనే వారు విమలవంక సాభిప్రాయ ముగాఁ జూచిరి. ఆ చూపులలో నేదో కొంటెతనము గోచరించు చుండెను. ఆ పరిహాస ధోరణి విమలకుఁ గోపముఁ దెప్పించెను. ఆమె యచ్చట నుండి లేచి పోఁదలఁచెను. కాని యెఱుకత యా మెను వారించి, చెఱఁగు పట్టి, కూర్చుండఁ బెట్టి, మఱలఁ బాట మొదలిడెను.

'ఉన్న మాటకు నీకు నులుకేఁటి కమ్మ?
తిన్నగాఁ గూర్చుండి, దేవి పార్వతినిఁ
దలఁచుకో! మనసులో; దండమ్ము పెట్టు;
ఫలియింపఁ జేయు భవాని నీ కోర్కె.
నీ వొప్పుకొనకున్న నిజము నా కెఱుక;
దేవత చెవిలోనఁ దెలియఁ జెప్పినది;
కన్నె ప్రాయమున నీ కన్ను నెక్కవగ,
విన్నదనంబుతో వెలవెలవోయి,
మిట్ట పల్లములన్ని గుట్టుగా దాఁటి,
చెట్టు పుట్టలు చూచి, చెదరిన మనసుఁ
జిక్కఁబట్టిన దమ్మ! శీతాద్రి తనయ;
యెక్కి పోయిన దమ్మ హిమగిరిపైకి;
మండు వేసఁగిని బెన్మంటల నడుమ,

నుండి చేసినదమ్మ! యుగ్రతపస్సు;
జడివానలో నిల్చి తడిసిపోవుచునె;
పిడుగులు పడుచున్న విడువ దా దీక్ష;
పులివంటి చలి వచ్చి చెలరేగుచున్నఁ
జెలువ కంఠము దాఁక జలమందె నిలిచె;
వచ్చినాఁడే! తల్లి! పరమేశ్వరుండు;
మెచ్చినాఁడే! యామె సచ్చరిత్రమ్ము;
కలఁగినాఁడే! మేరు కార్ముకుండైనఁ;
గరుణించెనే! విషకంఠుఁడై యున్న;
మాయావటుండై యుమం జేరె నమ్మ!
యా యమ్మ కెదురాడి యాయాసపెట్టెఁ;
'పోవోయి! వడుగ నా మ్రోల నిల్వకుము!
దేవదేవుని శివుం దిట్టిన నిన్నుఁ
గని, పాపమును మూటఁ గట్టుకోఁ జాల;
మనసెల్లనున్ స్వామి మయమయ్యె నాకు;
నెవరెన్ని చెప్పిన శివుఁ బాయఁ జాల;
శివుఁ డనుగ్రహముంచి, చేపట్టువఱకుఁ;
దనువున్న యన్నాళ్లుఁ దప మిట్లొనర్తు!
నని, మాఱు మోమయ్యె నతనికి గిరిజ,
నిజరూపమును జూపి, నిఖిలేశ్వరుండు
గజిబిజి మాన్పి యా కల్యాణి నేలె.”

పాట యాఁగెను. 'ఇంకేనా పాట?' యన్నట్లు చెలికత్తె లామె వంకఁ జూచిరి. ఆమె ముత్తియములు సంచిలోఁ బోసికొని సువర్ణము పదిలమొనరించుకొని 'అమ్మా సోదె నచ్చినదా!' అని తన్నుఁ బిలుచుకొని వచ్చిన యువతి నడిగెను. ఆ యువతి మాఱు మాటాడక ముందే యితర సఖు లందుకొని 'ఈ మాత్ర మందఱుఁ జెప్పుదురు. ఆ పురుషుఁ డెవఁడో! ఈమెయం దనుకూలు డో! కాఁడో! చెప్పనక్కఱలేదా!' యనిరి. అంతట నెఱుకత 'యాలాఁగా!' యని మఱలఁ బాట మొదలు వెట్టెను.

'తరుణి చిత్తములోని పురుషుం డెవండొ!
యెఱిఁగింపవయ్యా! విశ్వేశ్వరస్వామి!
రాకన్నె వలచిన రాజగా జెవఁడొ!
నా కెఱిగింపుమన్నా! వెనకయ్యా!
వాక్కులో నిలిచి యీ పడఁతి భావమ్ముఁ
జక్కఁగాఁ బలికింపు శారదాదేవి!
అదె! యల్లదె! చూడరమ్మ! యావలను
ముద మొప్ప నట నీమె పురుషుఁడున్నాఁడు;
రాజాధి రాజమ్మ! ప్రబలప్రతాప
రాజసింహుండమ్మ! రాకన్నె మగఁడు;
పాలించు చున్నాఁడు భారతంబెల్లఁ;
దేలించుచున్నాఁడు దిక్కులం గీర్తి
కర్పూరమున; శత్రుకంటకుండగుచు,
సర్పశయానుని శ్యాలకుంగొలిచి,

విలసిల్లు చున్నాఁడు పృథ్వీశ్వరుండు;
నెలఁత యాతని పేరెంచ నలరింపఁగలదు.”

విమలయుఁ జే నెట్టి కలఁచినట్లయ్యెను. చెలికత్తియలు తత్తరపడిరి. “ఇఁకఁ జాలించు నీ సోది. నీకుఁ దెలిసినచో పేరు చెప్పుము. లేనిచోఁ బొమ్ము. నీ పాట విని విని మా చెవులు చిల్లులు పడినవి.’ అని తొలుతటి యువతి యెఱుకతె నదలించెను. ఆమె యా పలుకులను లక్ష్యపెట్టినట్లు లేదు. మఱలఁ బాడఁ గోరి గొంతు సవరించుకొనుచుండెను. ఇంకొక యువతి కొంచెము కటు స్వరమున “నీ ధోరణి నీదే కాని మా మాట చెవిఁ బెట్టవేమి? స్పష్టముగాఁ బేరు చెప్పఁ గల్గిన జెప్పుము. లేనిచో నడువు”మని పల్కెను. ఎఱుకెత యించుకంతయుఁ జలింపక ‘అయ్యయ్యో! నా మాట తెలియలేదమ్మా! ఇంతకు ముందే చెప్పితినే!’ యనెను.

“పాట మాని యొక్కమాటలోఁ జెప్పుము. అతని పేరేమి?” యని యొకత యామెను హెచ్చరించెను. ‘ఒక్క మాటలోనా! ఇదిగో! ఈ బెత్తపు కొనఁ జేతఁ బట్టుకో! ఆయన పేరు తలచుకో!” అని యెఱుకత విమలకు బెత్తమందిచ్చెను. విమల బెత్తముఁ జేతఁ బుచ్చుకొని ప్రాణేశ్వరుని నామము స్మరించుకొనెను. ఎఱుకత బెత్తముయొక్క రెండవకొన నాఘ్రాణించుచుఁ గొంత సేపు గొణుగుకొని ‘చ-చ-చ-చక్రవర్తి ఔరంగజేబు’ అనెను. చెలికత్తెలు నిర్ఘాంతపడిరి. ఒక జవరాలు కొంచెము తెలివి దెచ్చుకొని ‘ఈ దౌర్భాగ్యురాలెఱుకత కాదు. మనల వంచింప వచ్చిన మాయావిని. దీనిని రాజభటుల

కొప్పగింప వలయు'నని పలికెను. ఎటుకత మాటముల్లెలు చంకc దగిలించుకొని 'వయసు కత్తెలు గనుక ముసలిదాని నేడ్పించి వినోదింతురcటమ్మా! నామాట పొల్లుపోదు. ఈమె కాయనయే పెనిమిటి' అని లేచి పోc దొడగెను. చెలికత్తె లామె పోక గమనించి 'దుర్మార్గురాలు పాటిపోవుచున్నది.' చూచెదరేమి? రండు. పట్టి రాజభటుల కొప్పగింతము.' అని యాటుకత వెంటc బడిరి. కాని యామె వారి పటుగుల కందక యెటో పోయెను.

విమల యా యెటుకత యుదయపురి పనుపునc దన్ను వంచింప వచ్చిన మోసగత్తియ యని గ్రహించి చింతాపరవశ యయ్యెను. చెలికత్తె లామెను బరితేర్చించి 'తల్లీ నీ వనోత్సాహము భంగింప నా దుష్ట యాడినపలుకులకు నీ వంతగాcగలవర పడెదవేల? నీ మనఃకాంతుcడు రాజసింహుcడు దుర్మార్గుడైన యౌరంగజీబు దౌర్జన్యమునుండియు, నుదయపురి కుతంత్రముల నుండియు నిన్నుద్ధరించి చేపట్టcగల'డని యనునయింపcదొడcగిరి. విమల వారి మాటలాలించి "సఖులారా! మహాత్ముcడైన మేవాడు ధరణీశ్వరుcడు న న్నెన్నc డనుగ్రహించునో! ఔరంగజీబు మాయావాగురనుండి రాజపుత్ర సంస్థానముల కెపుడు విముక్తి లభించునో! ఢిల్లీనుండి యీదుర్మార్గురా లిటకువచ్చి నాయెదుట నిన్ని దురుక్తు లాడ సాహసించెనన్న నుదయపురి దీనికెట్టి ప్రోత్సాహమిచ్చి యుండునో! ఇంకను మన పరిసరముల నెట్టి యురులు పన్ని యుంచినదో! అగ్రజుc డిన్నాళ్లుగా మమ్మేడcబాసి పోయెను. ఆతని ప్రయత్నము లెట్లున్నవో! మేవాడు నరేంద్రు నకు నా దురవస్థ యెవరు వినిపింపగలరో!"యని వెచ్చనూర్చెను.

అప్పుడొక సఖి యిట్లనెను. "అమ్మా! నీస్థితిఁ జూడఁగాఁ గృష్ణ పాదారవింద లగ్న చిత్తయగు వైదర్భి స్ఫురించుచున్నది. వైదర్భి కంసారికి సందేశమంపినట్లే నీవును గురుదేవుని ముఖమున నీ ప్రాణేశ్వరునికి సందేశమంపు టుచితమని తోఁచుచున్నది. జరాసంధాదులఁ దెగడి రుక్మిణిని జేపట్టిన శ్రీకృష్ణునివలెనే, యీరాంగజీబు నుక్కడఁగించి రాజసింహమహీకాంతుడు నిన్ను జేపట్టఁగలడు."

సఖియ పలుకులాలించిన విమల చెక్కుటద్దముల నాకస్మికముగఁ గెంపుల ప్రభ లావరించెను.



౩

అది మట్ట మధ్యాహ్నము. రవి కిరణములు నిట్టనిలువుగాఁ బుడమిపైఁ బ్రసరించు చుండెను. అవి శిలామయము లగుటవలనఁ గాఁబోలును! చిత్తూరు పురవీధులు కాలుచున్న పెనమువలె నుడికి పోవుచుండెను. వడగాడ్పు పిడుగులు వెట్టుచుండెను. ప్రజలా తాపము భరింపనేరక కిటికీలు, తలుపులు మూసికొని వీధి మొగమయినఁ జూడకుండిరి.

అట్టి ప్రచండ గ్రీష్మమునఁ బొట్టకూటికిఁ గాఁబోలు! ఒకఁడు పండ్లగంప శిరమున నిడుకొని 'రసాలు–రసాలో!' యని కుమారసింహ సౌధము దాపున నడచుచుఁ బోవుచుండెను, ఆ కుటీరములోని చంద్రవదన యా కేక విని, బయటికి వచ్చి యతనినిఁజూచి 'పండ్లు మంచివే తెచ్చితివా!' యని ప్రశ్నించెను. వాఁ డామె మాట విని కడువినయముగా గంప దించి 'మీరు పండ్లను భుజించి రుచిగా నున్నవే నాకు సొమ్మిప్పింపుడు.' అనెను. ఆ బాల 'ఎండతీవ్రముగా నున్నది. మా నాయనగారు చూచి తీసికొందురు, లోపలికి రమ్మని యతనిని వెంటబెట్టుకొని గృహములోనికిఁ బోయెను. తాపాధిక్యమునకు భారాతిశయమును తోడై యున్నను నలసట యెఱుఁగక యతఁ డామె వెనుకనే నడచి, కుటీరమునఁ దల్పగుఁడై యున్న యొక వృద్ధుని యొద్దకుఁ బోయి పండ్లబుట్ట దించి 'అమ్మయ్య'యనుకొనెను. వృద్ధు డతనిని జూచి 'ఏమోయీ! రసాలు మంచివెక్కడను వచ్చుచున్నట్లు లేదే! ఇవి ఎటువంటివి? పేరునకే రసాలా! రుచిలోఁ గూడనా!' యని ప్రశ్నించెను. అంతట నతఁడు 'అయ్యా నావస్తువుల గుణము నేను గీర్తింపఁ గూడదు. మీరు రుచిచూచి బేరము చేయవచ్చు' నని పలికెను. 'అమ్మా! వాసంతికా! ఒకపండు దీసి గిన్నెలో రసమునింపుకొనిరా. ఎట్లుండునో చూతు'మని వృద్ధుఁడు పుత్రికతోఁ బలికెను. 'అయ్యో! ఒకటేమిటి? రెండుపండ్లు చెరియొకటి గ్రహింపుఁ' డని పండ్లవాఁడు వాసంతిక చేతిలో రెండు ఫలము లుంచెను. ఆమె లోనికిఁబోయి, యొకగిన్నెలో ఫలరసము నింపి, తండ్రిచేతి కిచ్చి, తా నొక ఫల మారగించు చుండెను. వృద్ధుఁడు ఫలరసాస్వాదన తత్పరుఁడై, తనవాకఁ

జూడకున్నంత వఱకును, బండ్లవాని దృష్టి వాసంతికా ముఖము ననే లగ్నమైయుండెను. అతని మొగములో నేదో యొక యవ్యక్తానందము గోచరించుచుండెను.

వృద్ధుఁడు ఫలరసము సంపూర్తిగాఁ ద్రావి త్రేన్చెను. వాసంతిక 'నాన్నగారూ! కొంకి పులుపుగూడ లేదు. పండు చాల మధురముగా నున్నదికాదా!' యని ప్రశ్నించెను. 'రసాలనఁగా నివి!' యని వృద్ధుఁడు పలికెను.

పిమ్మట 'వెలయె'ట్లని వృద్ధుఁడు ప్రశ్నింపఁగా, బండ్లవాఁ 'డయ్యా! వెల విషయమై మీరు నన్నుఁ బ్రశ్నింపకుఁడు. నిత్యము గొని తినుచున్నవారేకదా! మీ దయవచ్చినంత యిప్పింపుఁడు. అంతేగాక నా కీనాఁడే సొమ్మియ్య నక్కఱలేదు! ప్రతి దినమును నాయొద్దనే కొనుచుండుఁడు. నాకుఁ బైక మవసరమైనపుడు మాత్రము వచ్చి యడుగుదును. మీబోటి గృహస్థులు పదిమంది యిండ్ల వాడుకగా నిచ్చుచుందును. అందఱి దగ్గఱ నిదే పద్ధతి. మీదయవలన నాకుఁ బైకమున కిబ్బందిలేదు.' అని యేఁబది పండ్లు లెక్కించి యిచ్చి గంప తీసికొని వెడలిపోయెను. వాసంతిక యాశ్చర్యాన్వితయై, యతని పోక గమనించుచుండెను. అతఁడు వెడలిపోవుచు, వెనుకకుఁ దిరిగిచూచెను. బాలకాతని ముఖమున నొక వింతవికాసము గోచరించెను. అతని దృష్టులచ్చముగా నా గతదినము సౌధసమీపగతుఁడై తన్నుఁ జూచిన యువకుని దృష్టులవలెనె యుండెను. ఆమెకు విభ్రాంతికలిగెను. ఆ యువకుఁడే యీ రూపమున వచ్చియుండునా! అయ్యయ్యో! అదేమి మాట! అతనివేషము దిలకింపఁగా నున్నత రసపుత్రవంశ

సంభవుఁడై, యున్నత పదస్థుఁడై యుండినట్లు తోఁచెను. అట్టి వాఁడు పండ్ల బేరగాని రూపమున నిట్లు నడయాడునా? నిమిత్త మేమైనఁ గానిమ్ము! అతఁడీ రూపములో నొదిగియుండఁ జాలఁడు. కాని యితని చూపు లిట్లు వాని దృక్కులవలె గుండియ దూసి కొని పోవుచున్న వేమి?"

నాఁటి సాయంతనమునఁ గుమారసింహ సౌధమున రామ సింహ కుమారసింహు లిట్లు సంభాషించుచుండిరి.

"మిత్రమా! నీ వుదయపురికిఁ బోవుట యెప్పుడు?"

"రేపే ప్రయాణము. నీవుకూడవత్తువా?"

"తప్పక వచ్చెదను."

"నీవ్యాపారమునకు భంగమగునేమో?"

"మిత్రమా! అదేమి చిత్రమో! వాసంతికా మూర్తి యయస్కాంత మినుమునువలె, న న్నాకర్షించుచున్నది. ఆమె సందర్శనమునకై, యామె మధురాలాపములు వీనులవిందుగా నాలించుటకై, నే నీ యుపాయ మాలోచించితిని. నా యుద్యమము కొంతవరకు ఫలించినది."

"కొంతవఱకేనఁగా నీ మన స్సామెయందు లగ్నమగు వఱకనియేనా!"

"అది యెప్పుడో యైనదికదా! రసాల ఫలవ్యాజమున వారి యింటికి రాకపోకలు గల్పించుకొనఁగలుగుట యనియే నా భావము."

"మంచిది. నీవు నాతో వచ్చినచో, వారికి ఫలము లెట్లు వచ్చును?"

"అయిదాఱు దినములవఱకుఁ జాలినఫలము లిచ్చి వచ్చితిని. నా వాడుక యీ స్వల్పకాలములో మఱియొకనికి దక్కదు లెమ్ము."

"అది యెట్లు సంభవమగును? కాని రామసింహా! రాణా వారు నన్నెందులకుఁ బిలిపించుచున్నారో తెలియకున్నది."

"ప్రభువులు చారచక్షువులుగదా! ఢిల్లీ రూపనగరము లందు నడచుచున్న కథలు వారికి వినిపించియుండును. భవిష్యత్కార్యక్రమమును నిర్ణయించి, యౌరంగజేబు దుర్వ్యవసాయము తుదముట్టించుటకే వారీ విధముగా రాజపుత్ర సమావేశ మేర్పఱచి యుందురు"

"నిజము. నిజము. రాజ్యమత్తతచేఁ గన్నులు గానని వాని యౌద్ధత్యమును జూచియుఁ జూడనట్లు సైరించుకొలఁదియు నతఁ డున్మత్తుఁ డగుచున్నాఁడు."

"ఈ సమయములో నంతఃకలహములు మఱచి, జాతి వైషమ్యములకు స్వస్తి చెప్పి, దేశీయప్రభువులును, ప్రజలును, నొక్కటై యతని నెదుర్కొనవలయును."

వీ రిట్లు మాటలాడుకొనుచుండఁగా వీథిలో నొక బిక్షుకుఁ డిట్లు పాడుచుండెను.

"బ్రదుకెల్ల వట్టి విభ్రాంతియే గాని,
తుదిదాఁక నెవఁడు సంతుష్టుఁడై మనెను?

అకట యీ వెఱ్ఱిబాలకు లిందుఁ గూడి,
ప్రకట చంద్రికలోనఁ బాడి యాడెదరు;
అల్లదిగో? వినీలాహి చందాన,
నల్లని మేఘసంతానమ్ము బలిసె;
చందమామను గ్రమ్మఁ జనుదెంచుచుండె;
మందుఁడై పవనుండు మన్ను దిన్నట్టు
లున్నాఁడు; చెలరేగి, యుఱ్ఱూపకున్న;
వెన్నెల నిలుచునే! వేడుకలున్నె!"

"రామసింహా! పాట వింటివా!"

"వింటిని. ఇందేదో ధ్వని యున్నది. చంద్రిక విమలాదేవి. మేఘు మారంగజేబు. పవనుఁడు రాణా! రాడా మన్నుదిన్న ట్లుపేక్షించి యున్నాఁడు. చెలరేగనేని యారంగజేబు దురుద్యమము విచ్ఛిన్నమగును. విమలకు స్వాస్థ్యము గలుగును. వెఱ్ఱిబాలకులమైన మన యానందము తిర మగును."

"రామసింహా! అతఁడు సామాన్య భిక్షుకుఁడై యుండఁడు. అధర్మమున కెదురు నిలిచి, ధర్మమును సంరక్షింపుఁడని, రస పుత్రులఁ బ్రబోధింపఁ దివురు మహాత్ముఁడై యుండును. అతనిఁ జూచి వత్తము రమ్ము."

ఇట్లు కుమారసింహుఁడు రామసింహుని హెచ్చరింపఁగా వా రిర్వురును గలసి సౌధము ముంగిటికి వచ్చునప్పటికి భిక్షుకునికిని ద్వారపాలకునికిని సంవాద మిట్లు నడచుచుండెను.

"నన్ను లోనికేల పోనీయవు? నేనును, నీ వంటివాఁడనే. అయ్యగారి నాశ్రయించి, భుక్తికింత సంపాదించుకొందును."

"నీవంటి బికారు లందఱు యథేచ్ఛగా లోనికిఁ బోఁ గలిగినప్పుడు నాయునికి వలని ప్రయోజనమేమి?"

"అయిన నీ విచ్చట నుండుట, మావంటి యార్తుల నిరోధించి పున్నెము గట్టుకొనుటకే యందువా?"

"గుక్కెఁడు గంజి గడించుకొను శక్తి లేకున్నను, మాట లలో మొనగాఁడవువలెనే కన్పట్టుచున్నావు. ముందు నాయెదుట నిల్వక పో."

"పట్టెడుముద్దకుఁ బరువు మర్యాద లమ్ముకొన్న నీ మాటలకు నేను బెదఱుదు ననుకొంటివా! ప్రభుదగ్గన మగు వఱకు నేనిచ్చటనుండి కదలువాఁడనుగాను."

"ఏమేమీ! నేను పరువుమర్యాదలు లేనివాఁడనా! దుష్టుఁడా! ఆవలికిఁ బోదువా! చత్తువా!"

"నీవు బ్రహ్మహత్యకుఁ గూడ సిద్ధపడి, యిహము లేదు సరిగదా; పరముఁగూడఁ జెఱచుకొందువా! కానిమ్ము. నేనుసిద్ధముగనున్నాను. ఇదిగో! తల. తెగనఱికి నీ కోపముఁ దీర్చుకో!"

ద్వారపాలకుఁ డప్రతిభుఁడై, నిలువఁబడిపోయెను. రామసింహ కుమారసింహులు ద్వారపాలకుని యవస్థఁజూచి, నవ్వుకొనుచు ద్వారము చెంగటికి వచ్చిరి. భిక్షుకుఁడు కుమారసింహునిఁ జూచి, 'రాజకుమారా! మంచి సేవకునే సంపాదించితిరి.

ఆ అజామునుండియు నన్నులోనికి రానీయఁడు. మీరు వచ్చితిరి గనుక నా ప్రాణములు నిలిచినవి. లేనిచో నీ పుణ్యాత్ముని కటారికి బలి గావలసిన వాఁడనే!' యని నవ్వుచు, ద్వారపాలకుని త్రోసికొని లోనికేఁగెను. ద్వారపాలకుఁడు తెల్లమొగముతోఁ బ్రభువువంకఁ జూచెను. ఈ పర్యాయము రామసింహ కుమార సింహు లప్రతిభులైరి.

భిక్షుకుఁడు ద్వారపాలకునిఁ జూచి, 'మతిహీనుఁడా! ఇంతమాత్రము తెలిసికొనలేకపోయితివా!' యని పరిహాసించి, 'రాజకుమారులారా! మాటలాడవలసిన విషయము లనేకము లున్నవి. లోనికిఁ బోదము రం' డనఁగా, విభ్రాంతులగుచు, రాజపుత్రు లాతనివెంట లోని కరిగిరి. ద్వారపాలకుఁ డచేతనుని వలెఁ గన్ను లప్పగించెను.



ఢిల్లీయను నామాంతరము వహించిన హస్తినాపురము చిరకాలముగా భారతచక్రవర్తులకు రాజధానియై, యెనలేని వైభవమునఁ దుల దూఁగుచున్నది. రాజవంశము లనేకములు వెలసినవి. సమసినవి. హస్తినాపురము మాత్రము యథాపూర్వముగానే విరాజిల్లుచున్నది. పుణ్యాత్ములైన మహీపాలుర కీర్తివల్లరులను బెంచి, తత్కుసుమ పరిమళములను దిగంతముల వఱకుఁ బ్రసరింపఁ జేయుచున్నది. లోకపావని గంగాభవాని, యీ నగరలక్ష్మికిఁదోడై చిరకాలమునాఁటి సాపత్న్యముఁ దలంచి కాఁబోలును; త్రవ్వి కందకమై యుపచరించుచున్నది. శిల్ప కళాలక్ష్మి తనయందు సంపూర్ణవికాసము గాంచిన దన, వన్నె కెక్కిన 'టాజ్ మహాలు' ప్రాభాతిక సూర్యకిరణములలో మిలమిలలాడుచు యమునాతీరమున నాడఁబోయిన నగరలక్ష్మి ముద్దుబిడ్డవలె మురిపెము మీఱుచుండెను. అందువలననె కాఁబోలును! ఢిల్లీ పురవాసులు ప్రత్యుదయ మార్గాలోని యీ దివ్యభవనము దిలకించి కాని, యితరవ్యాసంగము లిచ్చగింపరు. భోగలాలసులయిన మహమ్మదీయ నృపాలురు మత విషయములందెట్లున్నను, లలిత కళాపోషకులగుటచే, నా నగరము గాయకుల

కను, నర్తకులకును, శిల్పులకును, కేంద్రమై విరాజిల్లుచుండెను. అట్లయ్యును నౌరంగజీబు నృత్యగానముల యెడ విముఖుఁడగుట వలనఁ దొల్లిటివలె, విపంచీ మృదంగనాదములు వినిపించుచుండుటలేదు. ప్రరోపకంఠముల నుద్యానవనములు మాత్రము నేత్రపర్వమై యానంద లక్ష్మి విహారసీమలవలెఁ దనరారుచుండెను.

నాఁ డౌరంగజీబు జన్మదినోత్సవము. నగరమంతయుఁ జిత్ర విచిత్ర తోరణాలంకృతమై కన్నుల విందయ్యెను. సామంత నరపాలురుఁ బ్రధానోద్యోగులు, నూతనవస్త్రధారులై, ప్రభు సందర్శన మొనరించి, తమ యభివందనముల నెఱఁగింప నాస్థాన మందిరమున కరుగుచుండిరి. వేత్రహస్తులై, రాజభటు లందందు నిలిచి రాకపోకల కిబ్బంది గలుగకుండఁ జూచుచుండిరి. అన్నార్తులైన యభాగ్యులు రాజమందిరమున నన్నదాన మపేక్షించి యొకరి నొకర రతిక్రమించి పోవుచుండిరి. నర్తకులును, గాయకులును దమకు రాజ సమ్మానము కట్టువడినందులకుఁ గుములుచు వేడుక చూడఁగోరి రాజాస్థానమున కల్ల నల్లన నరుగుచుండిరి.

ఇట్టి తరుణమున నౌరంగజీబు షాజహాను సందర్శనార్థమై, కతిపయ మిత్రులు పరివేష్టింప, మత్తగజముపై నధివసించి చనుచుండెను. అతనిని జూచినంతనే భయ వినయములు సందడింప నంజలులు ఘటించి, ప్రజలు ప్రక్క-ప్రక్కల కొదిగిరి. అతఁడు చిఱునవ్వుతో వారివందనము లందుకొనుచు, సౌధాగ్రములనుండి పౌరకాంతలు కుసుమ వృష్టి గురియించుచుండ, మొగమెత్తి, వారలకు వందనము లర్పించుచుఁ దండ్రి యావాసముఁ జేరెను. ద్వార

రక్షకు లతనిఁజూచి, ప్రసంగములుసాలించి యంతలంతలఁ జేతులు గట్టుకొని, నిలువఁబడి, తలలతోడన యభివాదము లొనర్పఁ జక్రవర్తి మత్తగజము డిగ్గి, ప్రధానోద్యోగి యొకఁడు ముందు నడువ గంభీరదృక్కులు ప్రసరింపఁజేయుచు, మందిరముఁ బ్రవేశించెను.

ముసలిరా జప్పుడే సుస్నాతుఁడై యమూల్య వస్త్రాభరణములు ధరించి, మందిరాంతర్భాగములోని యొక హంసతూలికా తల్పముపైఁ బట్టు మెత్తలపై నొఱఁగి కూర్చుండి యుండెను. ప్రియా వియోగమును, పుత్త్రి వియోగమును, వ ఱువలేమిఁ గాంబోలును! అతని మొగమున విషాద రేఖలు విస్పష్టముగ గోచరించు చుండెను. అట్టుండియు నా వృద్ధనరపతి రాజ్యభార ధురంధరుఁడైన యౌరంగజేబుకంటె దర్శనీయుఁడై విరాజిల్లు చుండెను. విపత్కు భయంకరుఁడైన యౌరంగజీబా మందిరమున నడుఁగిడు నంతలోఁ బట్టపగలిటి భానునిమ్రోల నున్న దివ్వె చందమునఁ దండ్రియెదుట నిస్తేజుఁడైనట్లు ప్రేక్షకులకుఁదోఁచెను. అతని రాక గమనించికూడ, నా మయూర సింహాసన ప్రథమ భోగి, యెట్టిసంభ్రమమునకు దావీయక, వాలుఁ జూపుల నతనిఁ దిలకించుచు, నట్లె మెత్తలపై నొఱఁగి యుండెను.

ఔరంగజీబు నెమ్మదిగా నడచివచ్చి తండ్రి పాదముల చెంత మోకరించి యంజలి బంధించి, 'తండ్రీ! రూపనగరముపై దండెత్తి పోనున్నాను. జయము కల్గున ట్లాశీర్వదింపుఁ' డనియెను.

షాజహా నీ మాటలు విని "నాయనా! ఆడుదాని మాట విని యనవసరపుఁ గయ్యములఁ దగుల్కొందువా! ఇది నీకు

మేలుగాదు. అధర్మమువలన నపయశమును, నపజయమును, కలుగునేగాని సంతోష సౌఖ్యములు కలుగవు. ఇది గ్రంథముల లోని మాటయేకాదు. స్వానుభవమున గ్రహించిన సత్యము. రాజ్యకాంక్షచేఁ దండ్రినిఁ జెఱఁబెట్టితిని. సోదర వధ యొనర్చితిని. యౌవనమదమునను, లోభావిష్టతను నేఁ జేసిన యకార్యము వలన, నా తండ్రి హృదయమెంత క్షోభించెనో యానాఁడు నే నూహింపనైతిని. నేఁటి నాగతిఁ జూడుము. నా కన్నుల యెదు టనే నా కుమారులు నన్ను నిస్సహాయునిఁ జేసి, యొకరి నొకరు వధించుకొనిరి. ఇందులకు నే నెవ్వరిని నిందింపను. నేను నా తం డ్రిని దుఃఖితునిఁ జేసినట్లే నా కుమారులు నన్ను దుఃఖితునిఁ జేసిరి. స్వయంకృతాపరాధఫలము నే నిప్పు డనుభవించు చున్నాను. నీవుగూడ నావలె దుఃఖితుఁడ వగుట నేను సహింప జాలను. నీ వెట్టివాఁడ వైనను నా రక్తముఁ బంచుకొని వచ్చిన వాఁడవు, నీ కెల్లప్పుడును శుభము కలుగ వలయుననియే నేను భగవంతునిఁ బ్రార్థించుచుందును. కావున నే నా పలుకులు నీకుఁ బ్రియములైనను, గాకున్నను, నీ శ్రేయముఁ గోరి చెప్పితిని. ఈ జగములో శాశ్వతమైన దేదియును లేదు. నా తండ్రి నూర్జ హాను దేవికై కలవరించెను. ఆమెవలననే యంత్యమున కిక్కట్ల పాలయ్యెను. నేను మీ తల్లి ముంతాజిని విడిచి క్షణమైన బ్రతుక లేననుకొంటిని. ఆమె గతించి యన్నేండ్లయినను బ్రతు కుచునే యున్నాను. నీ కీ యుదయపురి శరణ్యపడినది. నాయనా! వివేకము కలిగి కార్యాకార్యములు నిర్ణయింపుము. చేతులు గాలిన యనంతర మాకులు పట్టి ప్రయోజనమేమి?"

తండ్రిమాటలు రుచించెనో, లేదో; కాని, యౌరంగజేబు సావధానముగా విని, పిమ్మట సెలవుగొని వెడలిపోయెను. షాజహాను తాఁ జెప్పఁదలఁచుకొన్న దంతయుఁ జెప్పినందులకు సంతుష్టుఁడై, ఫలాఫలము లీశ్వరుని చేతిలోని వని నమ్మి,నిశ్చింతుఁ డయ్యెను

అట్లు జనకుని వీడ్కొని యరుగుచున్న యౌరంగజేబు మనసులో నొక తర్కమారంభమయ్యెను. తండ్రి నేఁడు తన కిన్ని నీతులుపదేసించెనే కాని, తా నధికారములో నున్నప్పుడి ట్లేచేసెనా! అప్పుడీ వివేక మేల కలుగలేదు? సోదరులను మట్టుబెట్టలేదా! తండ్రిని జెఱఁబెట్టలేదా! హిందూ దేవాలయములను గట్టరాదని శాసింపలేదా! తన భోగ లాలసతకై ప్రజలసొమ్ము దుర్వినియోగ మొనర్పలేదా! తాను దండ్రివలెనే నడచెను. అందుల కాతఁడు తన్నేల యధిక్షేపింప వలయును?

అయినను రాజ్యసంపాదనమునకై, చేసిన కృత్యములు వదలి యితర విషయములఁ బరికించినచోఁ దండ్రికంటెఁ దాను వేయిరెట్లుత్తముఁడు. ప్రజాద్రవ్యములో గ్రుడ్డిగవ్వయైనఁ దాను భోగవిలాసములకు వెచ్చపెట్టుటలేదు. ఆళ్ళకు అప్పలనుఁ బెట్ట లేదు. స్త్రీ లోలతచే మతధర్మములు మంటఁగల్పుటలేదు. మత ధర్మములందు స్వల్పాంశమునైన నిర్లక్ష్య మొనర్పక యాచరించు చున్నాఁడు. ఈ నడుమఁ గొరానునకుఁ బ్రతులు వ్రాసి యందువలన వచ్చినద్రవ్యమునే సొంత ఖర్చులకు వినియోగించు చున్నాఁడు. ఇంతటి సామ్రాజ్యము, నింతటి సామర్థ్యము గలిగిన చక్రవర్తి మఱియెవ్వఁడైనఁ దనవలెఁ బవిత్ర జీవనము గడపిన

వాఁడున్నాడా! నాజరుద్దీనొక్కఁడు మాత్రము పూర్వులలోఁ దనకు సాటి కాఁదగినవాఁ డున్నాఁడు. కాని యతఁడు తనవంటి చక్రవర్తి కాఁడు. ఈ దేశములో నంతటి సామ్రాజ్య మేలిన మహమ్మదీయ చక్రవర్తి మఱియొకఁడు లేఁడు. తన ముత్తాత యగ్బరు చాల గొప్పవాఁడని లోకులందురు. అతఁడు పరాక్రమ వంతుఁడు కావచ్చును; గాని తనయంత విద్యావంతుఁడా! తనవలెఁ బర స్త్రీ విముఖుఁడా! మద్యపానము నిషేధించినాఁడా! హిందూ మహమ్మదీయ మతసామరస్యమున కనుమిష వెట్టి యెందఱినో రాజపుత్ర స్త్రీలను జేపట్టెను. ఆ హైందవపత్నులతోఁ గూడి నిజమత విరుద్ధముగా హిందూదేవతల నారాధించెను. పవిత్రమైన యిస్లాము మతము కంటెను గొప్పమతముఁ గనిపెట్టితి నని నిరుపయోగ మత మొకటి వెలయించెను. అది నిరుపయోగము గనుకనే, యతనితోడనే యంతరించినది. తానో అచ్చమైన యిస్లాము మతస్థుఁడు. తా నొనర్చుచున్న కార్యములన్నియు మతాభివృద్ధికిమాత్రమే. మఱియొకస్వార్థము లేదు. తానుసోదరులవధించి నను, దండ్రిని జెఱఁబెట్టినను, సింహాసన మధిష్ఠించినను, యుద్ధము లొనర్చుచున్నను నీ మతము కొఱకే. తాను మతమునకుఁ గింకరుఁడు. ఇట్టి తన పావనశీల మెఱుఁగక లోక మేమియో యూడిపోసికొనుచున్నది. తా నెన్నఁ డందులకు జింతింపఁడు. తానేది ధర్మముగా భావించెనో దానిని దుదముట్ట నెఱవేర్చును. ఉదయపురి చెప్పినట్లెల్లఁ దానాఁడు చున్నట్లు తండ్రి యుహాపోహపడెను. అది సత్యమా! ఉదయపురి మాటలలోఁ దన కనుకూలములైనవి మాత్రమే వినును; గాని యన్నింటికిఁ దలయూఁచునా! గురివిందగింజ తనక్రింది నైల్యము దా నెఱుఁగదఁట!

మానవుల యందును నీ గురివిందగింజవంటివారు పలువురుందురు. మన యౌరంగజీబట్టి వాఁడే. నుత ప్రవక్తల సూక్తులకుఁ దన యభిరుచికిఁ దనగిట్లు వ్యాఖ్యానము చేసికొని, తన వర్తనము పరమ పవిత్రమని యతఁడు భావించుచుండెను. తండ్రి తాత లతని దృష్టిలో మిగుల నల్పులుగాఁ దోఁచిరి. ఔరంగజీబు చదువుకొన్నవాఁడే. నిశిత మతియే. కాని ప్రయోజనమేమి? పండు మంచిదే! తియ్యనిదే! కాని ముణికిగుంటలోఁ బడినది. అట్లున్న దతని స్థితి. చదువెంతఁగా జదివినను, నది, వ్యక్తికి స్వభావసిద్ధమైన గుణమును బోషించునే కాని, దానికి మార్పుమాత్రము కల్గింపఁ జాలదు. వరూధిని విద్వాంసురాలే. ప్రవరుఁడును విద్వాంసుఁడే. ప్రవరునికిఁ జన్మముతో విషయ వైముఖ్యము, యజ్ఞాదికములు ముఖ్యముగాఁ దోఁచినవి. ఇహభోగములు మీసాలపైఁ దేనియలుగా భాసించినవి. అప్సరోజనసాహచర్యమును నతనికి వెగటై బ్రహ్మమునందే మనస్సులగ్నమైనది. ఇఁక వరూధినియో; మనస్సు దేనియం దేకాగ్రతఁ జెందునో యా యింపే పరబ్రహ్మానంద మనుకొన్నది. ఈ విపరీత పాండిత్యమే యామెను వలవంతల పాలు సేసినది. ఈ రహస్య మెఱుఁగని వారు చదువుకొన్న వారందఱు సద్గుణములు గలవా రగుదురని భావింతురు.

ఔరంగజీబట్లు స్వకార్యములను సమర్థించుకొనుబుద్ధితోఁ దర్క వితర్కములు సేయుచు, సంతృప్తుఁడై, పరివారముతో సభామందిరమున కేఁగెను. చక్రవర్తి రాక దిలకించి, సభ్యులెల్లరు వినయవినమితమస్తకులై, లేచి నిలుచఁబడిరి. అతఁడును

గంభీర దృక్కులతో వారిని విలోకించుచు, సింహాసనముఁజేరి యధిష్ఠించెను. వృద్ధుఁడగు నొక మౌల్వీ చక్రవర్తి నాశీర్వదించిన పిమ్మట సభ్యులు తాము కొనివచ్చిన కానుకల నర్పించిరి. ప్రభువు చిఱునగవుతో నా యుపాయనము లందుకొని వానికంటె వెలగల కానుకలను దెప్పించి సభ్యులాందఱికిఁ బంచిపెట్టించెను. అనంతరమునఁ జక్రవర్తి ప్రీతికిఁ బాత్రుఁడగు నొక మహామ్మదీయ వృద్ధుఁడు సభలో నిట్లు ప్రసంగించెను.

"నేఁడు మనకుఁ జాలసుదినము. మహామ్మదు ప్రవక్తకవతారావతార మనఁదగిన మన ప్రభువు జన్మించిన పుణ్యాదిన మిది. ఇస్లాము మతస్థుల కిది పరమ పవిత్రమైనది. విగ్రహారాధకు లగు హైందవు లందఱను నంధ విశ్వాసమునుండి విముక్తులఁజేసి, సత్యమైన యీశ్వరతత్త్వము నుపాసించునట్లు చేయఁ బ్రభువులు దీక్ష వహించినారు. ఈ మహాకార్యము నిర్వహించుటకు వా రొక్కరే సమర్థులు. గజనీ మహామ్మదు ధనకాంక్షతో మత విషయములంతగాఁ బట్టించుకొనలేదు, సరిగదా, హిందూదేశములో మహామ్మదీయ ప్రభుత్వము నెలకొల్పు టావశ్యకమని కూడఁ దెలిసికొనలేదు. గోరీ మహామ్మదా లోపముఁ దీర్చెను, గాని మతప్రచారమున కతని కెక్కువ యవకాశము చిక్కకముందే స్వర్గస్థుఁ డయ్యెను. బానిస సులతానుల పరిపాలనమందు రాజ్యవ్యవస్థ నిలుపుకొనుటే కష్టసాధ్యమైనది. ఖిల్జీ ప్రభుత్వమున కాయుర్దాయ మల్పమైనది. లోడీ లసమర్థులైరి. మొగలులు మాత్రమే దేహబలముతో బుద్ధిబలమును జోడించి, మహామ్మదీయ ప్రభుత్వము నీ దేశమందు సుస్థిరమొనర్చిరి.

హైందవులలోఁ గొందఱకైనఁ దమ మూఢ విశ్వాసములు పరిత్యజించి, సత్యమతము నవలంబింపవలె నను సంకల్పము కలిగినది. ఇప్పు డిప్పుడు వారిలో విద్వాంసులగువారు కూడ మన మత మాహాత్మ్యమును గ్రహించి మన మతమునే యవలంబించు చున్నారు. కాని యిప్పటి కావగింజలో నర్ధభాగము గూడఁ గాలేదు. చేయవలసినది మిక్కుటముగ నున్నది. ఈ భారము వహించుటకే యీశ్వరుఁడు శ్రీ శ్రీ శ్రీ అలంగీరు పాదుషావారిని సృజించెను. మనము చరిత్రఁ బరికించినచో సకల కల్యాణ గుణమూర్తి యగు నిట్టి చక్రవర్తి యే దేశముునను నే కాలమునను జన్మించి యుండలేదని గ్రహింపఁ గలము. చక్రవర్తులలోఁ బరాక్రమవంతు లనేకు లుదయింపక పోలేదు. విద్వాంసులును జన్మింపక పోలేదు. మతోద్ధరణ లగ్నమానసులగువారు పుట్టక పోలేదు. కాని, వారిలో నెవరి యందును నీ విశేషములన్నియు సమకూడలేదు. ఇదే మన చక్రవర్తి యందలి ప్రత్యేకత. ఇట్టి చక్రవర్తిని సేవించు భాగ్యము గలిగినందులకు నేను మిప్పుల గర్వించుచుందును. మన మందఱమును ప్రభువు తలపెట్టిన మతవ్యాప్తి మహోద్యమమున శక్తివంచన మొనరింపక పాటుపడవలసి యున్నది. అల్లా మన ప్రభువును చిరంజీవినిఁ జేసి తదుద్దిష్టమైన యీ యుద్యమమును ఫలింపఁ జేయవలెనని మనమందఱ మేక కంఠమునఁ బ్రార్థింతము."

అతని ప్రసంగ మిట్లు ముగిసినంతనే సభికులందఱు నేకగ్రీవముగఁ బాదుషా శుభముఁ గోరి యీశ్వర ప్రార్థన మొనర్చిన పిమ్మటఁ బాదుషా సానుచరుఁడై సభ వీడి యంతఃపురాభిముఖుఁడయ్యెను.

---

కాలగమన మద్భుతము. క్రమముఁ దప్పక ఋతు షట్కము ప్రవర్తించుచునే యుండును. రాశి చక్రమున గ్రహ ములు నియతముగాఁ జరించుచునే యుండును. వసంతమున సర్వము మనోహరముగా నుండును. గ్రీష్మమున నెండలు మండి పోవును. వర్షర్తువులో మేఘుఁడు జీవనము గురియించును. శరత్తు వెన్నెల వెలుఁగులలోఁ బ్రజల మనస్సుల నానందమున నోలలాడించును. హేమంతమున శైత్యము సర్వసంపూర్ణత నంది వడవడ వడకించును. శిశిరమునఁ బ్రకృతియను నాగాంగన కూర్పాసము విడిచి భవిష్యద్వసంత రామణీయకతకు సన్నా హము లొనర్చుచుండును.

ఇట్లే యొక్కొక్క దేశమునకు నొక్కొక్క జాతికి, నొక్కొక్క భాషకు నొకప్పు డనర్థపరంపరయు, నొకప్పు డభ్యు దయపరంపరయు, నొకప్పుడు సుఖదుఃఖ సమ్మిళిత స్థితియుఁ గలుగుచుండును. భారతదేశములో గ్రీష్మర్తు వుదయించినది. కాని యీ గ్రీష్మర్తు పరిణామము రెండు నెలలు కాదు. దీని పరిమితి వేయేండ్లు. ఈ వేయేండ్లలో మన కథాకాలము నాఁటి కేడువందల సంవత్సరములు గడచినవి. ఋతువుయొక్క పూర్వా ర్థమునఁ గంటె నుత్తరార్థమునఁ దాపాధిక్య మమితముగా నుం

డును. అప్పుడే విరాటపర్వ పఠనము, సహస్ర ఘటాభిషేకములు సమాచరితము లగుచుండును. అట్లే భారతవర్షమునకుఁ దటస్థించిన యీ వేసఁగిండ్ల గ్రీష్మర్తువులో నుత్తరార్థమునఁ బ్రజల యిక్కట్లు దుస్సహాము లయినవి. ప్రజలకుఁ దాపోపశమనము గలిగించుటకే మేవాడు ధరాధిపతుల నాయకత్వమున విశ్వేశ్వరునకు లయకారకునకు సహస్ర ఘటాభిషేక మారంభమైనది. లయకారకునకుఁ గావించు నీ యభిషేకమునకు మానవ రుధిరమే యోగ్యము కాని, జలము కాదు. ఆ ఘటములు గూడ మన యిండ్లలో నుపయోగించు ఘటములవంటివి గాక కొల్లేటి సరస్సులోని నీరంతయు నొక్కొక్కటి మ్రింగివేయ గల యంతటివి.

బేబరు ప్రభుత్వపుఁ దొలి దినములలో సంగ్రామసింహుఁడీ సహస్ర ఘటాభిషేక మారంభించెను. ప్రతాపసింహుఁడు దానిని దీవ్రతరము గావించెను. కాని భారతీయుల దృష్టిపథమున గగనమండలములో నొక్క మేఘశకలమైనఁ గానరాలేదు. అభిషేక ప్రయత్నమే కష్టసాధ్యమగుచుండెను. కాని చిత్తూరు నరపతులు చిత్త నిక్షేప మెఱుఁగని శ్రీ రాముని వంశమునఁ బుట్టినవారు. చండకరుఁడు చల్లఁబడెను, శీతకరుఁడు నిప్పులు గ్రక్కెను, నగ్నిజ్వాల లధోముఖములైనను, జీవన్ముక్తులు విస్మితులు గారట. రాజసింహుఁడును, ననంతరాయము లెన్ని ఘటిల్లినను, దనయుద్యమము సముత్సాహమునఁ గొనసాఁగించుచుండెను.

నాఁ డుదయపురమున రసపుత్త్రి వంశజు లెల్లరు సభఁ దీర్చిరి. ఆ సభలో నున్న యొక్కొక్కఁ డొక యగ్నిపర్వతము. వీతిహోత్రుని యరుణచ్ఛవి యది యచ్చటి ప్రతిపురుషుని నేత్ర

కోణములందును విస్పష్టముగ గోచరించుచుండెను. రాణా గంభీరుఁడై సింహాసన మధివసించి యుండెను. ఆ మహాపురుషుని మూర్తి నవలోకింప భీరునకైనఁ గొండంత ధైర్య ముదయించున ట్లుండెను. ఈ లోకోత్తర చరిత్రుని చెంతనుండి ఫాలాక్షునైనఁ బ్రతిఘటింపవచ్చునని కన్నవారికిఁదోఁచుచుండెను. మిన్నువిఱిగి మీఁదఁ బడినను జలింపనివాఁడు గావుననే రాణా యట్టి సమయమునఁ గూడ సహజ మందహాసము విడువక చూపఱ కానంద సంధాయకుఁ డగుచుండెను. అతని కప్పటికి ముప్పదేండ్లుండి యుండవచ్చును. యాదవుల నెదిరొ్కని సుభద్రను గొనిరాఁ బూనిన పార్థుఁ డా యీడువాఁడే యగునేమో! శిశుపాల జరాసంధాదుల నోడించి రుక్మిణిని జేపట్టఁ జన్న శ్రీకృష్ణుఁ డిట్లే యుండెనేమో? యని చూపఱు భావించు చుండిరి.

సభికులందఱు నిశ్శబ్దముగ నుండి రాణా యేమి సెలవిచ్చునో యని వినఁగుతూహలులై యుండిరి. రాణా దృష్టి సింహద్వారము దెసఁ బ్రసరించుచుండెను. అందువలన నతఁ డెవరి రాకనో ప్రతీక్షించుచున్నట్లుండెను.

ఆ సమయమునఁ బ్రేతాగ్నులవలె ముప్పురు పురుషు లా సభఁ బ్రవేశించిరి. వారినిఁ జూచినంతనే రాణాముఖపద్మము వికసించెను. వారును బ్రభువునకు నమస్కరించి యుచితాసనాసీను లైరి. పిమ్మట వారిలో నడుమనున్న వ్యక్తిపై రాణా చూపు ప్రసరించెను. అతఁ డా చూపున కర్థమెఱిఁగి, రాణా పార్శ్వమున నిలిచి, సభవారి కేమో విన్నవించుట కుద్యుక్తుఁ డయ్యెను. సభికుల దృక్పరంపర లతనిపైఁ బ్రసరించెను.

ఆ పురుషుఁ డేఁబది సంవత్సరములవాఁడు. దబ్బపండువంటి శరీరచ్ఛాయ గలవాఁడు. వార్ధక్యము తొంగి చూచుచున్నను బరిపూర్ణారోగ్యమున నలరారుచున్నాఁడు. కన్నులు చిన్నవైనను జూపులు తీక్ష్ణములై యెదుటివారిని నమ్రులను జేయుచున్నవి. నాసిక యించుక వంపుదిరిగి శుకనాసుఁడన నిట్టివాఁడే యగు నని పించుచున్నది. అతని ముఖము చంద్రమండలమువలె గుండ్రముగ నున్నది. ఫాలము సువిశాలము. అపుడపుడే పలితములగుచున్న యతని శిరోజములు పలుచనై, నడినెత్తిపై నసలే లేక శిరమునకుఁ జుట్టును మల్లెపూదండఁ గట్టినట్లున్నవి. నాతిస్థూలము, నాతి దీర్ఘమునైన యతని తనూయష్టి దర్శనీయముగ నున్నది.

ఇట్టి యీ వ్యక్తి సభవారిఁ గలయఁ బరికించి యిట్లు ప్రసంగించెను.

“రసపుత్ర వంశాలంకారులారా! పౌరుషనిధులగు మిమ్మం దఱ దర్శింపఁ గలిగినందులకు నేను మిపుల సంతసించుచున్నాను. స్వస్థానము, స్వభాష, స్వధర్మము నను వానియందు మక్కువ గలిగి యాత్మోన్నతికై ప్రవర్తించు మీరు చరితార్థులు. ప్రస్తుత భారతదేశ సౌభాగ్యము మీ కృషిపై నాధారపడి యున్నది. నేఁడు మనదేశము పరదేశీయులచేతఁబడి తఱుగుచున్న సంస్కృతితో మనలకుఁ గన్నీ రొదవించుచున్నది. నేఁడు భారతదేశములో స్థిరనివాసులమైన మన యగచాట్లంతకంతకు మిక్కుటములగుచున్నవి. బేబరు నాఁటఁ బ్రభుత్వమే తొలఁగినది; కాని, స్వధర్మాచరణమునకు విచ్ఛిత్తి కలుగలేదు. హుమాయూను పరిపాలనము గూడఁ గష్ట మనిపింపలేదు. అగ్బరు నాఁటి నుండి

రసపుత్రుల కిక్కట్లారంభమైనవి. అదృష్టవశమునఁ బ్రతాపసింహ మహారాజు ధైర్య హిమాచలమై యతని నెదుర్కొని మేవాడు భూభాగమున స్వధర్మమున కాశ్రయ మిచ్చినాఁడు. జహంగీరు షాజహాను లిద్దఱుఁ బ్రతాపసింహ మహీపతి యుద్యమము నాయన యనంతరమునఁ గూడ నశింపఁజేయఁ జాలరైరి. నేఁడు ఢిల్లీ సింహాసనముపై నౌరంగజీబు వెలుఁగొందు చున్నాఁడు. అక్బరు మంగలము వంటివాఁడు. ఔరంగజీ బగ్నికుండమే. ఆసేతు హిమాచలమును దనకుఁ బాదాక్రాంతము గావించుకొనవలెనని యతని సంకల్పము. ఈ సంకల్పము చేతనే నెపములు వెదకి రస పుత్ర రాజ్యములపై యుద్ధముఁ బ్రకటించుచున్నాఁడు. శ్రీ రాజ సింహ ప్రభువులు ధర్మ రణభేరి మ్రోయించి మేవాడు భూభాగ మున నాతఁ డడుఁగిడకుండ నిరోధింపఁ గలిగిరి.

ఇట్లుండ మా రూపనగర సంస్థాన మౌరంగజీబు విష దృష్టిలోఁ బడినది. ఉదయపురి యీ విలయమునకు నాంది నడపినది. మా రాజకుమారి విమలాదేవిని దన కిచ్చి వివాహము గావింపవలసినదని యతఁడు నేఁడు వర్తమానము చేసినాఁడు. బలహీనమైన మా సంస్థానము మొగలు సైన్యముల నెదిరించి నిలువఁ జాలదు. కాని మా మహారాజు మొగలు విభునికిఁ గుమారిక నిచ్చుటకు సమ్మతింపలేదు. రాకుమారి తనమూల మునఁ దండ్రికిఁ దటస్థించిన విపత్తుఁ దలపోసి కుమిలిపోయినది. విష ముఁ ద్రావియో జలములఁబడియో ప్రాణములఁ బాయఁగోరినది.

వీరవరేణ్యులారా! ప్రభాకరసందర్శనోత్సుకయైన పద్మినిని మత్తగజము రూపుమాపఁగోరి వచ్చుచున్నది. కుసుమోద్గమము

డాసిన మాధవీ లతను ద్రెంచివేయుటకై మర్కట ముత్సహించు చున్నది. శరణాగతత్రాణ పరాయణులుగదా రసపుత్రులు. రాకుమారికి నేను ధైర్యముఁ జెప్పి రసపుత్ర చక్రవర్తి నీ విపత్తినుండి మమ్ముద్ధరింప వలసినదని యభ్యర్థింపవచ్చితిని. ఇదిగో మా మహారాజు ననుమతితో విమలాదేవి యంపుకొన్న విజ్ఞాపన పత్రము. తమ యనుమతి యైనచోఁ జదువుదును.''

వెంటనే సభికు లా విన్నప మెట్టిదో వినఁగోరిరి. రాణాయును నుత్కంఠితుఁ డయ్యెను. రూపనగర దూత విజ్ఞాపన పత్రము నిట్లు చదివెను.

క. శ్రీమన్మంజుల సద్గుణ
ధాముసకున్, రాజపుత్ర ధరణీశ్వర తా
రామండల విభ్రాజిత
సోమునకున్, రాజసింహ శుభ నామునకున్.

చ. ఉదయపురీ ప్రభుత్వ కలితోన్నత కీర్తికి, రూప పట్టణే
శు దుహితయైన యీ విమల సుస్థిరభక్తి నమస్కరించి చే
యఁ దనరు విన్నపం బిది సమాదరతన్ విని యార్తరక్షణా
భ్యుదిత యశంబు నిల్పు నను నూహమెయిన్
లిఖియించు నీ గతిన్.

తే. ఓ మహారాజ! రాజన్య యోగ్యయైన
కన్య జీవితముం ద్రుంపఁగా దలంచె
మానవాకృతి నుండిన దానవుండు
వానిఁ బోఁద్రోలి కన్నెఁ గాపాడఁ గదవె.

క. ఈవే ప్రాణాధారం
బీ విమల కుపేక్షఁ జేసితేనియు ననలం
బో! విషమొ! శరణ మయ్యెడి
భూవర! మఱియొండు పలుకఁ బోవను దీనన్.

తే. బ్రహ్మ విష్ణు శివాఖ్యమై పరఁగు చుండు
దివ్య తత్త్వంబు కరుణ వర్ధిల్లుఁ గాక
భువన కల్యాణ వాంఛా ప్రపూర్ణమైన
రాజసింహోద్యమం బనారతము మహిని.

విమలాదేవి సందేశమునందలి ప్రతిపదమును, రసపుత్రులకు వీరోత్సాహము గల్గించెను. రాజసింహుని మనస్సార్ద్రమయ్యెను. అతఁడా దూత నుద్దేశించి యిట్లు పలికెను.

"ఆర్యా! సిద్ధ సంకల్పులగు మీవంటి మహనీయులు తలంచిన కార్య మమోఘముగా ఫలించును. మీ బోటి విద్యానిధులకు శిష్యురా లగుటవలననే రాకుమారి పౌరుష విలసితమై యాత్మగౌరవము సంరక్షించుకొని, దానితో రాజపుత్ర వంశ మర్యాదయు నిలుప దీక్షవహించినది. మే మెట్లయిన రాకుమారి నీ యాపదనుండి యుద్ధరించుటకు మా ప్రాణములఁ బణములుగా నుంచి కృషి సేయుదుము. నిశ్చింతమై యుండవలసిన దని మీ రామె కెఱిఁగింపుఁడు. ఏకలింగేశ్వరస్వామి కటాక్షమున మనకు విజయము తథ్యము."

విమలాదేవి సందేశముఁ గొనితెచ్చిన యా మహనీయుఁ డామె విద్యాగురు వని యిందువలనఁ దెల్లమైనది. అతనితో

వచ్చినయువకు లిర్వురు రామసింహ కుమారసింహులే! రసపుత్ర ప్రభుఁడు వారినిఁ జూచి, యిట్లనెను.

"వీర యువకులారా! మీ యప్రమత్తత కెంతయు సంతసమైనది. చిత్తూరులోని మొగలు రాజప్రతినిధి కంట దుమ్ము గొట్టి కుమారసింహుఁడొనర్చు నద్భుతకృత్యములు మాకు మోదహేతువు లైనవి మృత్యుసదనము వంటి మొగలు రాజధానిలోఁ బ్రచ్ఛన్నుఁడై, నిరపాయముగ సంచరించి, శత్రు ప్రయత్నము లెఱిఁగించుచున్న రామసింహునికి రసపుత్రులు కృతజ్ఞులు. మీ తోడ్పాటున నౌరంగజీ బొక్కఁడేఁ కాఁడు. మూఁడు లోకము లెత్తివచ్చినను జయింపఁగలము."

పిమ్మట సభఁ గలయఁ జూచి, రాణా యిట్లనెను. 'వీరులారా! వింటిరిగదా మొగలు చక్రవర్తి దౌర్జన్య కథ. మీ రందఱు నేకీభవించి, స్వదేశ, స్వజాతి, స్వధర్మ గౌరవములు సంరక్షింపఁ గృతప్రయత్నులగుఁడు. ఈ యవకాశము మనము చక్కఁగా వినియోగించుకొని యతనికిఁ దగురీతి జ్ఞానోపదేశము సేయవలయును.'

సభికు లానందోత్సాహములతోఁ బ్రభు వాక్యములు విని హర్షధ్వానము లొనర్చిరి. అతిథులఁగూడి రాణా సభనుండి వెడలెను.



అది యర్ధరాత్రము. కన్ను పొడుచుకొన్నను గానరాని కటిక చీఁకటి. చిత్తూరు పుర వీధులన్నియు, నిర్మానుష్యములై యుండెను. అందందు శ్వానముల యారావములును, గీచురాళ్ళ రొదయును వినవచ్చుచుండెను. అట్టి తరుణమున నొక వ్యక్తి చిత్తూరు పురిలోని యొక యిఱుకు సందునఁ బడిపోవుచుండెను.

అతఁడు కొంతదూర మిట్లరుగునప్పటి కొక మసీదు చెంత నేదో యలజడి వినవచ్చెను. పాంథుడు కుతూహలమున మసీదు చెంతకరిగి యటనున్న యొక వృక్ష మారోహించి మసీదులోనికిఁ జూచెను. అచట నలువురు పురుషు లొకవ్యక్తిని జేతులు వెనుకకు విఱచికట్టి, యేమేమో ప్రశ్నించుచుండిరి. అచటి దీపపు వెలుఁగునఁ బాంథుఁ డావ్యక్తి ముఖలక్షణములను బరిశీలించుచు, నా వ్యక్తి తనకుఁ బరిచితమైనట్లే యుండియు విస్పష్టముగాఁ దెలిసికొనలేకపోయెను. పాంథుని మనసులో నలజడి ప్రారంభమయ్యెను.

వారు మహమ్మదీయులు. మధుపానవశులై, యూఁగుచుఁ దమకుఁ జిక్కిన యా వ్యక్తిని బహువిధముల దూషించుచుండిరి.

ఒకఁడు తన చేతనున్న కరవాలము నా వ్యక్తికిఁ జూపుచు బెదరించుచుండెను. బాటసారి యీ దౌర్జన్యముఁ గాంచి కుపితుఁడయ్యెను. తోడనే యతఁడు తన మూపునఁ దగిలించుకొని యున్న ధనుస్సుదీసి యా దుష్టులు నల్వురిని నాల్గు నిశిత శరములచే నేలఁ గూల్చెను. పిమ్మట నతఁడు నెమ్మదిగా మసీదు గోడపైకెగఁబ్రాకి లోనికి దుమికి యా నిర్బంధిత వ్యక్తికి బంధవిముక్తి గలిగించి, 'ఇంకఁ బోదము రా. ఆలస్యమైన నిచ్చట నపాయము సంభవింపఁగల' దని యా వ్యక్తి చేయిపట్టుకొని మసీదు తలుపులు దెఱచుకొని, వీధిలోకి వచ్చెను.

బాటసారి యా వ్యక్తిని వెంటఁబెట్టుకొని కుమారసింహుని సౌధమునకు వచ్చి, చెఱుముకి వెలుఁగున ద్వారపాలకునిఁ దన్ను గుర్తింపఁజేసి, లోనికిఁ బ్రవేశించెను. బాటసారి తాను రక్షించిన యా వ్యక్తితో సౌధముఁ బ్రవేశించి, యేవో పత్రములఁ జదువుకొనుచున్న కుమారసింహుని సందర్శించెను. అతఁడు బాటసారినిఁ జూచి 'ఓహో! రామసింహా! నీవా! ఎచ్చటినుండి? ఈ బాలుఁ డెవ్వఁడు? ఇతఁడు నీ వాసంతికకు సోదరునివలె నున్నాఁడు. కాని వాసంతిక కెవ్వరును సోదరులు లేరే!' యని పలుకుచు నా వ్యక్తినిఁ బరీక్షించి చూచెను. వాసంతిక యను పేరు విన్నంతనే యా వ్యక్తి కొకవిధమైన తొట్రుపా టుదయించెను. కాని మిత్రయుగ్మ మది గమనింపలేదు.

రామసింహుఁ డిట్లుచెప్పెను. "కుమారసింహా! వాసంతిక యేమైనదియుఁ దెలియదు. నేను నగరమునకు వచ్చినంతనే యామెకుఁ బ్రీతిపాత్రము లని రసాలఫలములు గొని వారియింటికిఁ

బోయితిని. ఆ యింట నెవ్వరును లేరు. వాకిలి మూయఁబడి యున్నది. మనము రాకపూర్వమే కార్యవశమునఁ దండ్రి కూతుం డ్రెచ్చటికైన నరిగి రనుకొంటిని. తదనంతరమున రూపనగరము నకుఁ బోయి మన గురువుగారిని సందర్శించితిని. ఆయన నా రాకకుఁ జాల సంతసించి, నన్ను రెండు దినము లట నుండవలసిన దని బలవంత మొనర్చుటచేఁ గాదననేరక, మూనాళ్లుండి విమలాదేవిని సందర్శించి నీ సమాచార మంతయుఁ జెప్పితిని. ఆమె నీవు కనఁబడ నందులకెంతయుఁ జింతించినది. 'ఉన్నవాఁ డొక్కఁడే సోదరుఁడు. అట్టి సోదరుఁడు బహు దినములుగా నన్నెడఁ బాసి తిరుగు చున్నాఁడు. ఈ క్లిష్ట పరిస్థితిలో నా యగ్రజుఁడే నా చెంత నుండిన నా కెంత ధైర్యముగా నుండును?' అన్నది. నేను 'భయ పడవలదమ్మా! నీ యగ్రజుఁడు కుమారసింహుఁడు ని న్నెన్నటికిని మఱచిపోఁడు. కారణాంతరములచే నతఁ డింటికి వచ్చుటలేదు. కాని నీ క్షేమసమాచారములను నిత్యము విచారించుచునే యున్నాఁడు. ఔరంగజీబు రసపుత్రరాజ్యమువైపు కన్నెత్తిచూడ కుండఁ జేసి, భద్రతఁ జేకూర్పవలయు ననియే మహారాజ రాజసింహుని యాశ్రయమునఁ గృషి చేయుచున్నాఁడు. రాణా విషయమై గురుదేవులు నీకుఁ జెప్పియే యున్నారు గదా! నీవు చింత వర్జించి యుత్సాహముతో నుండు'మని చెప్పితిని."

రామసింహుని పలుకులు విన్న కుమారసింహుఁ డార్ద్ర నయనుఁడై యతనిఁ దిలకించి 'రామసింహా! ప్రాణముకన్న మిన్నగా నన్ను మన్నించు సోదరి నింతకాల మెట్లెడఁ బాయఁ గలిగితినో తెలియకున్నది. తండ్రి ప్రత్యక్ష దైవముకదా! ఆయన యొక్కింత

తూలనాడె నని దురభిమానినై యిట్లు వచ్చితిని. విమల న న్నానాఁ డెన్నివిధములనో శాంతింపఁ జేయ యత్నించినది. ఆహా! ఆమె ముద్దు మొగ మిప్పుడు కన్నులఁ గట్టుచున్నది. నాకే ఱెక్కలుండిన నిప్పుడే రూపనగరమున కెగిరిపోయి నా చెల్లెలినిఁ జూచి రాకుందునా! మా తల్లి దండ్రు లెట్లున్నారో! ఈ కష్టకాలమున సమీపమున నుండి వారికి ధైర్యముఁ జెప్పుటకు మాఱుగాఁ బ్రచ్ఛన్నజీవితముఁ గడపుచుఁ దల్లిదండ్రులపట్ల నావిధి నెఱవేర్ప నేరక బ్రదికియుఁ జచ్చినవాఁడ నైతిని.''

అనఁగా రామసింహుఁ డతనినిఁ జూచి 'మిత్రమా! నీ మన స్సింత మృదువని నే నెఱుఁగను. ఎఱిఁగియే యుంటినేని నీ కిట్లన్ని సంగతులను బూసగ్రుచ్చినట్లు వినిపించియుండను. అయినను గతజలసేతుబంధన మేల? నీ శపథము విస్మరించితివా యేమి? ఈనఁగాచి నక్కలపాలు చేసినట్లు, మన ప్రయత్నము ఫలోన్ముఖము గానున్న యీ సమయములో నిట్లు దైన్య మొందుట తగునా!' అని పలుకఁగాఁ గుమారసింహుఁడు "మిత్రమా! మానవుఁ డెల్లప్పుడును సుఖాభిలాషియై యేవేవో ప్రయత్నములు చేయుచునేయుండును. అది ఫలింపనున్నట్లేయుండి యంతకంతకుఁ బొడ వగుచు నెంతో దవ్వునకుఁ గొంపోవుచుండును. చూడు. ప్రతాపసింహమహారాజు జీవిత కాలమంతయుఁ బ్రయత్నముల తోడనే గడచెను. తుట్టతుదకైనను నాయన మనోరథము సంపూర్ణముగ ఫలింపలేదు. ఆ యసంపూర్ణ మనోరథముతోఁ జింతావశుఁ డగుచునే యాయన స్వర్గము నలంకరించెను. నాకు ముప్పది సంవత్సరములు వచ్చినవి. బాల్యము సుఖముగనే గడిచినదనుకో!

జ్ఞానమువచ్చినది మొదలుకొని సంపూర్ణ స్వాతంత్ర్యమునకై ప్రయత్నములు చేయుచునేయున్నాను. ఆ ప్రయత్నము లిప్పటికి నష్టేయున్నవి. తల్లిదండ్రుల కెడమైతిని. ముద్దుల చెల్లెలినిఁ జూడనైతిని. నా మనస్సు వారు స్మృతిపథమునఁ దగిలినంతనే మధుర భావములతో పొంగులు వాఱును. ఇట్లు నా బ్రతుకింతవఱకుఁ గలలతోఁ గడచిపోయినది. నీ విషయము విచారింపుము. వాసంతికా సందర్శనమున నీ వున్మత్తుఁడ వైతివి. ఆమెను జూచినఁ జాలునని పండ్లబేరగాఁడవై యామె యింటిచుట్టును దిరిగితివి. నేఁ డామె యేమైనదో తెలియదు. కాని మొన్నటి దినమున నేను విచారింపఁగా నెవరో దుండగీంద్రామె తండ్రిపైఁ గత్తి గట్టఁగా నాయన నాకై విచారించి నేను గ్రామాంతరమున నున్నట్లు విని యంతవఱకుఁ గూడ నిచట నుండునవకాశము లేక కూతురితో నుదయపురికిఁ బయనమయ్యెనని తెలిసెను. వా రుదయపురమున కేగిరో, దుండగీంద్రకు బట్టువడిరో తెలియదు.” అను నంతలో నా బాలమూర్తి “అయ్యో! తండ్రీ!” యని యఱచి మూర్ఛిల్లెను. అప్పుడు రామసింహ కుమారసింహులు విస్మితులై ‘ఓహో! ఈమె మన వాసంతికయే. పురుషవేషముతోఁ దండ్రితో బయలుదేఱినది కాఁబోలు!’ ననుకొని యామెకు శైత్యోపచారములు కావింపఁ జొచ్చిరి.

కొంతసేపటికి వాసంతికకు స్పృహావచ్చెను. ఆమె రామసింహునిఁ జూచి లజ్జించి యొదిగి యొకప్రక్కకుఁ గూర్చుండి తండ్రినిఁ దలంచుకొని కన్నీరు విడచుచుండెను. కుమారసింహుఁ డామెను జూచి “అమ్మా! ఏల దుఃఖింతువు? నీకుఁ గల్గిన

యపాయ మెట్టిదో తెల్పిన పక్షమున మాకుఁ జేతనైనంత యుపకారము నీకుఁ గావింప యత్నింతుము." అనగా వాసంతిక శోకము నిలువరించుకొని యతనికి బ్రుత్తర మిచ్చెను.

'అన్నా! ఈ దీనురాలి కష్ట చారిత్రము నేమని చెప్పుదును? నా తండ్రి మొగలు ప్రభువునొద్ద సేనాపతి. చిన్నతనమున నే జనని స్వర్గస్థురాలైనది. నేనుగాక మఱి బిడ్డలు లేనందునఁ దండ్రి నన్ను మిక్కిలి ప్రేమతోఁ బెంచి విద్యాబుద్ధులు నేర్పించెను. శాస్త్రముతోఁబాటు శస్త్రవిద్యయు నభ్యసించితిని. జనకుఁడు నా కౌశలముఁ జూచి మెచ్చుకొని 'నీవు వీరాబాయి వలె వీరకాంతవు కాఁగల'వనెడి వాఁడు. ఆయనతో నేనును రణభూమి కరిగి పురుషవేషమున రణక్రీడలోఁ బాల్గొనెడిదానను. ఒక్కొక్కప్పుడు నేను యుద్ధభూమికి వచ్చుటకూడ నాయనకుఁ దెలిసెడిది కాదు. శిబిరమునకుఁ దిరిగివచ్చిన పిమ్మట నెవఁడో బాలుఁడు మహాపరాక్రమముఁ బ్రదర్శించినాఁడని ముచ్చటించుచుండఁగా, నా చెలికత్తె 'లా బాలుఁడు మీ వాసంతికయే' యని చెప్పినపు డాయన బ్రహ్మానంద మొందెడివాఁడు.

కొండెగాం డ్రెవరో చక్రవర్తి చెవిఁ గఱచిరి. మా నాయన జాత్యభిమానమున రసపుత్రులకుఁ దోడ్పడి రాజద్రోహము గావించుచున్నాఁడని చెప్పిరి. చక్రవర్తి మా నాయనను ఢిల్లీకి రమ్మని కబురంపెను. ఢిల్లీకిఁ బోవు టనఁగా మృత్యువునోటి లోనికిఁ బోవుటయే. తన చిరకాల సేవకుఁ జక్రవర్తి యొసఁగఁ బూనిన యుపాయన మిట్టి దగుటకుఁ దండ్రి విచారపడెను.

తుదకు నా కొఱకై యాయన జీవింపఁగోరి ప్రచ్ఛన్నముగా నన్ను వెంటఁ బెట్టుకొని చిత్తూరికి వచ్చెను. అప్పుడు మేము దక్షిణాపథమున నుంటిమి. అడుఁగడుఁగున మొగలుల వేఁగులవాండ్రు మమ్ములను బట్టుకొనుటకుఁ బ్రయత్నములు చేయుచునే యుండిరి. ఇరువురమును గాలినడకనే ప్రయాణముచేయుచు జనసంచారములేని యరణ్యమార్గములు పట్టి యెట్టెటో యిచ్చటికి సురక్షితముగాఁ జేరుకొంటిమి. ఇఁట నుండి యుదయపురికిఁ బోవలయునని మా సంకల్పము. కాని నిరంతర ప్రయాణముల వలన నలసియుండుటచేతను, జిత్తూరునఁ బ్రభుత్వము మహమ్మదీయులదే యైనను, వారు లెల్లరు రాజపుత్రులుగదా! యను ధైర్యము వలనను గొన్నాళ్ళిచ్చట నివసింపఁ దలఁచితిమి. మాకిచ్చటఁ గాలము సుఖముగనే కడచుచున్నది.

కాని నేఁటికి నాలుదినముల క్రిందట నొక వనిత మా యింటికి వచ్చెను. అది యెప్పుడో యేకలింగేశ్వరస్వామి యాలయమున నన్నుఁ జూచినదఁట! నాఁటినుండియు నన్నుఁ గలసి మాటలాడుటకై ప్రయత్నించుచున్నదఁట! చెలికత్తె లెవ్వరును లేని నే నామెతోడి సఖ్య మబ్బినదిగదా! యని సంతసించితిని. ఆ మఁఱుదినమున నది నన్నుఁ జూడవచ్చినపుడు నా సౌందర్య మభివర్ణింపఁ జొచ్చినది. అంతియగాక నే నంగీకరించిన యెడల మొగలురాజ ప్రతినిధితో నాకుఁ బాణిగ్రహణము సంఘటింతు నన్నది. నాకుఁ జాలఁ గోపమువచ్చి 'నీ విట్టి మాటలు నాకు జెప్పవ'ద్దంటిని. అది నవ్వుచు 'నీ తండ్రి మొగలులకంట దుమ్ముగొట్టి యిచ్చట నుండుట నాకుఁ దెలియదను కొంటివా? నేఁ

దలంచినచో నిప్పటి కిప్పుడు మిమ్ములను బట్టించి ఢిల్లీకిఁ బంపఁ గలను. నీవు నీక్షేమమును నీ తండ్రి క్షేమమును గాంక్షించిన యెడల నా యుపదేశ మంగీకరించి యతనిని బెండ్లాడుము. అతఁడు చక్రవర్తితోఁ జెప్పి నీ తండ్రికి వెనుకటి యుద్యోగ మిప్పింపఁ గలఁడు. బాగుగా నాలోచించుకొని సాయంతనమునకు నాకు సమాధానముఁ జెప్పు' మని వెడలిపోయినది.

'నేను నా తండ్రి కిది యంతయుఁ జెప్పితిని. ఆయన మీ సాహాయ్యమున నుదయపురికిఁ బోవచ్చు ననుకొనెను. కాని మీ రిచ్చట లేరు. ఆలస్య మయ్యేనేని యా దుష్టురా లన్నంతపని సేయఁగలదని మాఱువేషములతో నుదయపురికిఁ బయలుదేఱితిమి. కాని...అయ్యయ్యో! ఆ దుర్మార్గురాలు...మార్గ మధ్యమునఁ గొందఱు భటులతో వచ్చి, మమ్ములను బధింపఁ బోయినది. నా తండ్రి వృద్ధుఁ డయ్యును గాలభుజంగమువలె మండిపడుచు వారిపైఁ గవిసెను. నేనును నా తండ్రికి సాయమైతిని. కాని యా మార్గముశిలామయము. శత్రువు లశ్వారూఢులు. ఒకదుష్టుఁడు నా తండ్రి శిరస్సు ఖండించెను. పదుగురు గూడి నన్నుఁ బట్టుకొనిరి. నగరములోని మసీదులోనికిఁ దెచ్చి మా నాయకునిఁ బెండ్లాడెదవా! లేదా! యని నిర్బంధింపఁ దొడఁగిరి. పిమ్మట నడచిన వృత్తాంతమునకు వీరే సాక్షు' లని రామసింహునిఁ జూపెను.

అంతట రామసింహుఁడు కుమారసింహునిఁ జూచి 'మిత్రమా! అట్లు మసీదులో బంధింపఁబడినయీ మెను బరివేష్టించి

యీ క్రొంగుబోతు లాడు దుర్భాష లా మార్గమున వచ్చు నాకుఁ గర్ణగోచరము లయ్యెను. నే నా సమీపమునఁ గల వృక్ష మెక్కి లోపలి దృశ్యముఁ జూచితిని. సమయమునకు నాయొద్ద ధనుర్బాణము లున్నవి. ఆ దుష్టులను సంహరించి పిమ్మట మసీదులోనికిఁ బోయి యీామె నిటకుఁ దోడ్కొని వచ్చితి' నని పలికెను.

అప్పుడు సమరసింహుఁడు వాసంతికను జూచి 'అమ్మా నీ యందితని కేలకో యొక యాత్మీయత యేర్పడినది. నేఁటి ఘట్టమువలన నితని యందు నీకును నట్టి యాత్మీయత నెలకొనుట కవకాశము గలిగినది. నా కితఁ డాత్మీయుఁడు. ఇప్పుడు నీవును నాత్మీయురాల వైతివి. ఎప్పుడు నీవు న న్నన్నా యని పిలిచితివో యప్పుడే నీవు నా విమలవంటిదాన వైతివి. ఇచ్చట నీకింక నెట్టి భయమును గలుగదు. నీ జనకుని ప్రాణ మపహరించిన యీ దురాత్ములను నా నిశితాసికి బలివెట్టుదు నని శపథ మొనర్చుచున్నాను. నీవు నిర్భయముగా నిందు వసించి శుభదినముల కై నిరీక్షింపుచుండు' మని పలికెను. వాసంతిక యొక్కింత చిత్త శాంతి వహించెను.

~~~
~~~

౭

వాసంతిక జనకమరణజనితమైన శోకమొక్కింత మఱ
చెను. ఆమె యనుదినమును, రామసింహ కుమారసింహుల
సంభాషణములఁ బాల్గొనుచు, 'నౌరంగజీబున కెప్పుడు పరాభ
వము కల్గునా! యనియు, రాజపుత్రస్థాన ప్రజలకుఁ బ్రశాంత
జీవన మెప్పుడబ్బునా! యనియు, నాలోచించుచుండెను. ఒక
ప్పుడు కుమారసింహుఁడు దూర నుండఁడు. మఱియొకప్పుడు
రామసింహుఁడు దూర నుండఁడు. ఒకొక్కప్పుడు వారిద్దఱు
గలసిపోయి రెండు మూఁడు దినముల వఱకు రారు. అట్టి సమయ
ములందు మాత్ర మామెకుఁ దండ్రి జ్ఞాపకమునకు వచ్చును.
తల్లి మరణించిన దాదిగా నామెను తన్నెట్లు ప్రేమించినదియును,
దలఁపునకువచ్చి, మిక్కిలి క్రుంగిపోవును. గవాక్షమూలమునఁ
దాము పూర్వము నివసించిన కుటీరము దెసఁ జూచి యశ్రువులు
రాల్చును. అట్టి సమయములం దొకొక్కప్పు డామెకు రసాల
ఫలములు స్మృతిఁ దగిలి, తన సందర్శన మపేక్షించి రామసిం
హునివంటి మహాపురుషుఁడు పండ్ల బేరగాఁడై వచ్చుట స్ఫురిం
చును. తోడనే యట్టి మహావీరునకుఁ దనయందుఁ గల్గిన గాఢాను
రాగమునకుఁ గృతజ్ఞత యెట్లు ప్రదర్శింపగలనా! యను నాలో
చన ముదయించును. ఆ యాలోచనలో నామెకుఁ గపోలము
లెఱ్ఱవడును. అధర మంతకంతకుఁ బలుచనై చిఱునగవులు
మోసులెత్తును. ముఖపద్మము వికసించును. ఏవో తీయని తలఁ

ఫులు ముమ్మరముగా ముట్టడించి యామెకుఁ బారవశ్యము గల్గించును. ఆ పారవశ్యములో నామె దుష్యంతుని యనురాగ మూహించుకొనుచు, నతనికి లేఖ రచింపఁగోరిన శకుంతలవలెఁ గాన్పించును.

నాఁడు రామసింహ కుమారసింహులిర్వురు నింటలేరు. వాసంతిక తలుపులుమూసి, రెండవ యంతస్తువున గవాక్షము చెంత నిలిచి, తనకుటీరము దెసఁ జూచుచు నశ్రువులు విడచుచుండ, నెచటినుండియో వచ్చుచున్న రామసింహుఁ డామెకుఁ గాన్పించెను. రామసింహునిదృష్టి యామెపైఁ బ్రసరించెను. ఆమె కన్నులొత్తుకొని క్రిందికిఁ బోయి తలుపులు దీసెను.

అతఁ డామెను జూచి 'వాసంతికా! శాస్త్రపరిచయముతో, శస్త్రపరిచయమును గల్గిన దంటివే! ఇంతేనా నీ ధీరత? రసపుత్రవనిత యెవ్వతెయైనను వీరమరణ మొందిన జనకునికై కాని, సోదరులకై కాని, కట్టుకడకుఁ బతికై కాని, కంటఁ దడి వెట్టునా? నీవు వ్యర్థముగా శోకింపక నీ భవిష్యజ్జీవిత మానందకంద మగు మార్గ మాలోచింపుము. ఏకైకబంధువగు జనకునిఁ గోల్పోయిన నిన్నుఁ జూచిన నా హృదయము నీరగుచున్నది."

'ఏకైకబంధువగు జనకునిఁ గోల్పోయిన ని' న్నని యతడు పలుకఁగనే వాసంతికకు మఱల దుఃఖ ముప్పొంగెను. 'అయ్యో! తండ్రీ!' యని కేక వైచి మూర్ఛిత యయ్యెను. రామసింహుఁ డామె దుఃఖమును జూచి, సహింపఁజాలక, శైత్యోపచారము లొనర్చుచు నామె శిర స్సంకమునఁ జేర్చుకొని వస్త్రముతోఁ

గన్నీటిధార లొత్తుచు, 'వాసంతికా? స్పృహ వచ్చినదా!' యని ప్రశ్నించుచుండెను. కొంతసేపటికి వాసంతిక కన్నులు దెఱచెను.

ఆమె తాను రామసింహుచేఁ బరిచర్య లందుకొనవలసి వచ్చినందులకు సిగ్గునఁ గ్రుంగిపోయెను. వెంటనేలేచి యావలకుఁ బోవఁ బ్రయత్నించెను గాని నైరస్య నైరాశ్యములవలనఁ గూలఁ బడియెను. రామసింహుఁ డామెకుఁ జేయూఁత నిచ్చి నిలిపి, 'వాసంతికా! ఈ వేళ నింతగా నధైర్యపడుచున్నా' వేమని యడిగెను. వాసంతిక యతని మొగమునఁ జూడ్కి నిలిపి 'అనన్య శరణ్యనై మి మ్మాశ్రయించితిని. ఇఁక నా జీవితమునకు మీరే యాలంబము. మా తండ్రియే యున్నచో...'అని ముఱలఁ గన్నుల నీరు నించెను. రామసింహుఁ డామె కన్నీటి ను త్తరీయాంచలమున నొత్తుచు 'వాసంతికా! నీ వింకదుఃఖించిన నేకలింగేశ్వరు నిపై నానసుమీ!' అనియెను. ఆమె యా పలుకులువిన్నంతనే దుఃఖమపనయించుకొని యతని వంకఁజూచెను. అతఁడు బాష్పావరుద్ధనేత్రుఁడై యుండెను. ఆమె కంత దుఃఖములో నవ్వు వచ్చెను. 'నన్ను దుఃఖింపవలదని చెప్పి మీరు దుఃఖింపఁ జొచ్చినారా!' యని నవ్వెను.

రామసింహుఁ డామెను జూచి 'నిన్నోదార్చుట కశక్తుఁడనై కన్నీరు నించితిని. వాసంతికా! ఆ నాఁడు నీవు రసాల ఫలములమ్మువానినిఁ బిల్వనచ్చిన నాఁడే నీయందు నాకొక యాత్మీయత యేర్పడి యా బంధ మంతకంతకు దృఢమైనది. నీ కన్నీరు చూడఁగా వజ్రసదృశ మైన నా హృదయము ద్రవించిపోవును.' అనఁగా 'గసపుత్ర వనిత లెట్టి యాపదలందైనఁ గంటఁ దడిపెట్ట

రాదంటిరే! పురుషులు దుఃఖింపవచ్చును గాఁబోలు!' నని వాసంతిక పరిహాసించెను. అప్పుడు రామసింహుఁడు 'అమ్మయ్యా! ఇప్పటికి బ్రతికితి' నని నవ్వెను. వాసంతిక యతని నవ్వు చూచి 'అమ్మదొంగా! ఎంత నాటకమాడితిరి? ఇదంతయు నన్ను నవ్వించుట కేనా!' యని ముంగోపమున లోనికిఁ బోఁబోయెను. రామసింహుఁ డామెచు జేయిపట్టి నిలువరించి, 'సుందరీ! నన్ను వంచకునిగా భావించుచున్నావా!' యని యడిగెను. వాసంతిక యందులకు నవ్వుచు 'వంచకులన్న వంచకులా! వంచక చక్రవర్తులు! కానిచో రసాలఫలముల నెపమున వాసంతికా ప్రణయ రస మాస్వాదింపఁ గలరా!' యనెను. రామసింహుని హృదయ మానంద తరంగముల నూఁగెను.

ఇంతలోఁ గుమారసింహుఁడు నవ్వుచు నచ్చటికి వచ్చెను. అతఁడు రామసింహునిఁ జూచి 'బావా! నేఁడు గదా! నా కొక యానందహేతువు కలిగినది. సోదరి వాసంతిక విషయమై నా మనస్సిప్రుడు స్వస్థపడినది. మా విమలను గూడ వాసంతికను జూచిన ట్లెన్నఁడు చూడఁగల్గుదునా! యనియే యాలోచించుచున్నాను. ఆ కామితముగూడ నెఱవేరెనేని నాకింకఁ గావలసినది లేదు" అనెను.

వాసంతికా రామసింహు లతని పలుకులు విని యొక్కింత సేపు మౌనముద్ర వహించిరి. పిమ్మట రామసింహుఁడు కుమారసింహునిఁ జూచి 'బావా! ఇంక సౌధాగ్రమునకుఁ బోవుదము. నీతో మాటలాడవలసిన యంశములు పెక్కు లున్న' వనఁగా నిర్వురుఁ గలసి, మేడ మీఁదికిఁ బోయిరి. వాసంతిక రామసింహుని హృదయమునఁ దనకు స్థానమున్నట్లు తెలిసినందున స్వస్థ హృదయయై మధురకల్పనలలో మునిఁగెను.

౮

ఔరంగజీబున కా నాఁడు మిక్కిలి వ్యాకులముగా నుండెను. అతని ప్రేయసి యుదయపురి తనయెడ నప్రసన్నయగుటయే యా వ్యాకులతకుఁ గారణము. సింగమువంటి పురుషుఁడప్రసన్నయగు ప్రేయసియెదుటఁ బిల్లి యగునఁట! ఆఁ! యన్న నపరాధము. ఊఁ! యన్నను నొప్పిదము కాదు. ఆమె పట్టిన పంతముఁ జెల్లింపవలయును. అంతవఱకు నామె క్రుద్ధ నాగాంగన వలె బుసకొట్టుచునే యుండును. పురుషుఁడేమి చేయఁగలఁడు? అనునయోక్తు లాడఁబోయెనా! అదలించును. దగ్గఱించునా! చీదఱించును. పాదములు పట్టుకొనునా! మొగము చెక్క లగునట్లు తాడించును. ఆ యవస్థ సైఁపలేక యావలికిఁ బోవునా! కుమిలి కుమిలి యేడ్చును. తోడి కాంతలకుఁ జెప్పుకొని తాను దిట్టి, వారిచేఁ దిట్టించును. అన్నము దినదు. నీరు ద్రావదు. వలువ మార్పదు. తల దువ్వదు. దీనితో నెట్లు వేఁగవచ్చును? పోనీ! దాని కోరికఁ దీర్పవలయునా! అది సామాన్యపుఁ గోర్కి కాదే! ధన వ్యయ మొక్కటియే యైనచో నెట్లో సహింపవచ్చును. ఈ కోరిక యట్టిదికాదు. ఇది నెఱవేర్పవలె నన్నఁ గొన్ని వేలమందిని బలి యీయవలయును. కూలికిఁ బ్రాణము లమ్ముకొను నిర్భాగ్యులున్నారు గనుక వారిని బలి యీవచ్చు ననుకొందము. కాని, కాల మననుకూలమైనచోఁ దాను గూడ బలి కావలసి వచ్చును. అది తనతోఁ గూడఁ బోక, తన సంతతిని బలి గోరవచ్చును.

ఛీ! ఛీ! ఇదియును కార్యమా! ఆము ధాత్రి వలె వ్యవహరించు చున్నది. కానిచోఁ దా నామె మాట జవదాఁటలేఁ డేమి? భారత వర్షమునకుఁ దాను సామ్రాట్టుగా భావింపబడుచున్నాఁడు. తన పేరు విన్నంత శౌర్యధనులగు రసపుత్త్ర రాజులుగూడ నట్టిట్టులగు చున్నారు. తన కంటికెంజాయలో రాజేంద్రు లనేకులు శలభముల వలె మ్రగ్గినారు. తనకంటిమలుపుతో స్వదేశసంస్థానములు వ్యత్యస్తము లగుచున్నవి. ప్రపంచ విజేతగా నలంగీరు బిరుదమువహించి నాఁడు. ఇట్టి తానా! ఒక్క యాఁడుదానికి జవాబు చెప్పలేక తత్తఱించుట!

అతనికి రోస ముదయించినది. చెప్పినట్లు వినక యిట్లు మూర్ఖశాలివలెఁ బ్రవర్తింపవలదని యామెను గట్టిగా మందలింప వలె ననిపించెను! అప్పటికిని నామె విననిచో నిఁక నామె మొగముఁ జూడఁగూడ దనుకొనెను. ఆమె తిండి మానుఁగాక! దిక్కులు మార్మ్రోగఁ వెక్కివెక్కి యేడ్చుఁగాక! తిట్టుఁగాక! తిట్టుకొనుఁ గాక! నడివీటఁ బడుఁగాక! తాను లక్ష్యమొనర్పరాదు.

ఇదిగో! ఇదే! కడసారిపోక. నేఁ డామె యథాపూర్వము గనే ప్రవర్తించెనేని యిఁక నామె కున్నవే పాట్లు. పో నిమ్మని మన్నించిన కొలఁదియు నెత్తి కెక్కుచున్నది. దీని మూలమునఁ దనకు నగు బాటగుచున్నది. ఉదయపురి గీచిన గీత దాఁటనేరఁ డౌరంగజీ బని నలుదెసలకుఁ బ్రాకిపోయినది. ఇఁకఁ దాలిమి కవ కాశము లేదు. బాగుగా బుద్ధి చెప్పవలయును.

కాని దానికైనఁ గార్యక్రమ మొకటి ముందుగా నిర్ణయిం చుకొన వలయునుగదా! అది యిట్లుండ వలయును. తాను

దిన్నగా నతఃపురమునకుఁ బోవును. పరిచారిక లంతే లంతలఁ దప్పుకొందురు. పాన్పుపైఁ బండుకొనియో, తలవాంచి కూర్చుండియో, విషాదమూర్తియైన యుదయపురి తనకుఁ గానఁబడును. తా నామెను గనెత్తియైనఁ జూడక యే గోడకో చెప్పినట్లు, తాను జెప్పఁ దలఁచుకొన్న మాట లన్నియుఁ జెప్పును. రాజనీతి యంతయు నుపన్యసించును. తనకుఁ గోపమే వచ్చెనేని, యెట్టి యాప్తులనైన శిక్షింప వెనుదీయక పోవుట సోదాహరణముగా వివరించును. రాజ్య వ్యవహారములలో స్త్రీలు ప్రవేశించి యల్పాంశములకై పతుల కవస్థలు గల్పింపఁ దగదని చెప్పును. అప్పటికిని నామె శాంతింపనిచోఁ దాను బెద్ద పెద్ద యంగలతో బయటికి వచ్చును. వెనుకనుండి యామె కబురంపుఁ గాక! ఆమె స్వయముగనే పిలుచునుగాక! చూపు లోకసమున నిలిపి, పిలుపు వినఁబడి కూడ, వినఁబడనట్లే సాగిపోవును, గాని వెనుకకుఁ దిరిగి చూడఁడు.

ఈ నిశ్చయముఁ జేసికొనునప్పటి కతఁ డంతఃపురమునకు రానే వచ్చెను. ప్రక్కగదిలో నుదయపురి చెలికత్తెతో నేమో మాటలాడుచుండుట వినిపించునప్పటికిఁ దా నంతఃపురములోనికి వచ్చితి నని గ్రహించెను. అతఁడు తన కెట్టయెదుటఁగాని పార్శ్వములందుఁ గాని దాసీజను లెవ్వరు లేకపోవుట గమనించెను. మొగము వెనుకకుఁ ద్రిప్పిచూచెను. అచ్చటను నెవ్వరును లేరు. అతఁ డంతట నుదయపురి యున్న గది కీవల సోఫాపైఁ గూర్చుండి లోపలి సంభాషణము శ్రద్ధగా నాలించుచుండెను.

"అమ్మా! మీ రిట్లు దీర్ఘక్రోధమువహించుట పాదుషా వారికిఁ జాల విచారకరముగ నున్నది. ఎట్లయిన మీరు మనసుఁ జిక్కఁబట్టుకొని శాంతి వహింపవలయును."

"మాధురీ! నీ వాఙ్మాధుర్యముఁ గ్రోలుటవలన నిన్నాళ్లు జీవింపఁ గల్గితిని గాని లేనిచో నింత పరాభవము జరిగిన పిమ్మట జీవించి యుండఁగలనా? వదిన రోషనారదృష్టి మహారాష్ట్రముపైఁ గేంద్రీకృతమై యున్నది. పాదుషావారు సోదరి కెదురాడ నేరరు. భార్యను గనుక నాయందౌదాసీన్యముఁ జూపుచున్నారు. నేను పుట్టినింటివారి కెడమై సాంప్రదాయముల గూడఁ ద్రోసి రాజని వీరి చెట్టఁ బట్టితిని. ఇపుడు నన్ను బ్రదికించినను జంపించినను వారే కాని నా ముద్దుముచ్చటలు దీర్చు నాప్త బంధువు లెవ్వరు? నాపైఁ గత్తిఁ గట్టఁగల పగవా రెవ్వరు?"

"తల్లీ! పాదుషావారికి మీయందు నిరాదర భావము పీసమంతైన లేదు. కాని యిప్పుడే మహారాష్ట్రమున విప్లవము వచ్చిపడినది. తనకీ సమయమందే పూపనగర సంస్థానముపై నాగ్రహ ముదయించినది."

'ఆగ్రహమా! దుర్మార్గురాలా! నేను నట్టిదురభిమానిని నని భావించుచున్నావా! న న్నెన్ని యన్నను నా కింత క్రోధము గలుగదు. హైందవస్త్రీకిఁ బ్రత్యక్షదైవము భర్త. అట్టి నా ప్రత్యక్షదైవమును దృణప్రాయముగాఁ దిరస్కరించి నిందించినది విమల. మాధురీ! ఏ పతివ్రతయైనను నింత కథ జరిగిన పిమ్మట శాంతించి యూరకుండఁ గలదఁటే. నీవే చెప్పుము."

"ఔనమ్మా! ఆ రోష మాయన కుండవలయును గాని తా మూరక మనస్తాప మొందుట వలన ఫలమేమి?"

'ఆయన యొకటియు నే నొకటియునా? నా భర్తను దూషించిన దుర్మార్గురాలిని నేను శిక్షింపక విడిచిపెట్టఁ గలనా? నేఁ డాయన వచ్చినంతనే యడిగెదను. ఆయన నా యభిప్రాయ మంగీకరింపకేని నే నొక్కతెనే నా బుద్ధిబల ముపయోగించి నా శత్రువును శిక్షింతును. అది నాకుఁ బ్రాణాంతకము కానిమ్ము. సంతోషముతో నా ప్రాణము లర్పింతును. నా ప్రాణేశ్వరుని ప్రతిష్ఠ నిలుపుటలోఁ బ్రాణత్యాగమే కలుగునేని, నా కంతకన్నఁ గావలసిన దేమి?

పాదుషా యిఁక రహస్యముగా నిలువ లేకపోయెను. అతఁడు 'ప్యారీ!' యని యనురాగరసము పొంపిరి వోవఁ బ్రణయిని నుద్దేశించి పలికెను. మాధురి యా పిలుపు విని తత్తఱపాటుతో 'దేవీ! పాదుషావారు విచ్చేసినారు. నా కింక సెలవిమ్మని వెలుపలికిఁ బోయి పాదుషాకు నమస్కరించి యెడ గలుగఁ బోయెను. పాదుషాయును జిఱునవ్వులు చిందు మొగమునఁ బ్రేయసి యున్న చోటికిఁ బోయెను.

ఆమె చెంపను జేయి పెట్టుకొని పాన్పుపై నొక్కింత యొరగాఁ గూర్చుండెను. ఆణిముత్తియములవలె నామె కనుదమ్ములనుండి బాష్పములు దొరలుచుండెను. అధరపల్లవము మాటిమాటికిఁ జలించుచు నిట్టూర్పు సెగకుఁ గాఁబోలు వాడినట్లుండెను. పాటలారుణము లగు లలిత కపోలములు నిరాహార దీక్షమేఁ గాఁబోలుఁ బరిపాండురములుగాఁ దోఁచుచుండెను. ఆ విషాద పరిదీనమూర్తి యగు ప్రియురాలినిఁ గాంచుటతోడనే

చక్రవర్తి యచ్చటకు రాఁబోవు నపుడు భావించు కొన్న కార్య క్రమమంతయు విస్మరించెను. అతఁడల్లనల్లన సఖిచెంత కరిగి మఱల నొకమాఱు 'ప్యారీ!' యని సంబోధించెను. ఆమె పైఁట చెఱఁగునఁ గన్నులొత్తుకొని పాన్పుదిగి గోడకుఁ జేరగిలఁబడి కాలి బొటన వ్రేలితో నేల గీఱుచు, నిలువఁబడెను. బాదుషా యామెను జూసి చుబుకమెత్తి 'ప్యారీ! నాపైఁ గోపమా?' యని ప్రశ్నించెను. ఉదయపురి గద్గదస్వరముతో 'మీపైఁ గోపము దెచ్చుకొని నేను బ్రతుకఁ గలనా! నా దురవస్థ నేఁ జింతించుదాననే కాని యొరు లెవ్వరిపైఁ గూడఁ గోపమూనుదానను గాను.' అని జవాబు చెప్పెను. అంతటఁ జక్రవర్తి యామెను నెమ్మదిగాఁ బాన్పుపయిఁ గూర్చుండఁ జేసి యనునయోక్తు లిట్లు పలికెను. 'ప్రియురాలా! మాధురితో నీకుఁ గలిగిన వివాదమంతయు వింటిని. నీకున్న విచార మంతయు నన్యులు దూషించినందులకే కాని నిన్నన్నందులకుఁ గాదని తెలిసికొంటిని. ఇట్టి నీ సత్యానురాగ మెఱుఁగక పట్టినపట్టు విడువని మూర్ఖురాల వనుకొంటిని. నా యీ దురభిప్రాయ మిప్పుడు మాసిపోయినది. ఇపుడు నిన్ను నేను దప్పుఁదలఁచినందులకు క్షమ యర్థింపవలసియున్నది. ఇవి చేతులు కావు. కాళ్ళనుకో. నా తప్పు మన్నించి నన్ను వెనుకటి వలెఁ బ్రేమదృష్టులఁ బరికింపుము. ఓసి ప్రియా! నీ ముఖమున మందహాసము కానరాని క్షణము నాకు గాఢాంధకార మావరించి నటు లుండును. ఇన్నాళ్లును నీవు కోపపరవశవై యుండఁగాఁ బరితాపవశుఁడనైన నాకు క్షణ మొక యుగముగా నైనది. వృద్ధ రాజు నన్ను స్త్రీలోలుఁడ వైతి వన్నాఁడు. ఉదయపురి మాట కెదురాడ నేరక యౌరంగజేబు రూపనగరముపై దండెత్తు చున్నాఁ

డని లోకులు పలుగాకులై వాకొనుచున్నారు. 'భర్తను గీలు బొమ్మగాఁ జేసి యూశించు నుదయపురి' యను నపప్రథ వ్యాపింప కుండుటకే నే నిన్నాళ్లుపేక్షించితిని. నే నుపేక్షించుట కసమర్థతయే కారణ మనుకొని యల్పులు నోరికి వచ్చినట్లు ప్రేలు చున్నారఁట. ఇఁక నెంత మాత్ర మాలసింపక రూపనగరముపై దండెత్తిపోయి యా గర్వోన్మత్తురాలు విమలను బట్టి తెచ్చి నీ కొప్పగింతును. నీ యిష్టానుసార మామెను శిక్షించి నీ పరాభవాగ్నిఁ జల్లార్చుకొనుము."

అని యౌరంగజీబు పలికినంతలో నుదయపురి యందుకొని "నాథా! అట్లుకాదు. మీరు రణరంగమునకుఁ బోయి శస్త్రాస్త్రముల నడుమఁ జిక్కికొనినుండ నే నంతఃపురమున నిష్టాన్నము లారగించుచు సుఖింపఁగలనా? నేనును మీతో వచ్చెదను. కాదనక నన్ను మీ వెంటఁ గొనిపొండు" అని యడిగెను.

ఔరంగజీ బామె మాటలకు ముదితుఁ డయ్యెను 'ప్రేయసీ! నీకు నాయందుఁ గల గాఢానురాగ మట్లు పలికించు చున్నది. కాని నీవంటి యసూర్యంపశ్యలు రాఁ దగిన చోటు కాదు రణరంగము. ఒక్కొక్కప్పుడు తినఁ దిండి దొరకకపోఁగా త్రావ నీరైన లభింపదు. ఆకలిదప్పులచేఁ బీడింపఁ బడుచునే, శత్రువులతోఁ బోరాడవలసి వచ్చును. జయాపజయములు దైవాధీనములు గదా! ఏ వేళ కేమగునో తెలియదు. అడుసున నిలిపిన కంబమువలె గాలిపాటున గెలుపోటములు తాఱుమాఱగుచుండును. అట్టిచోఁ బాఱిపోవుటకైన నవకాశము చిక్కదు. పురు

షులమైన మే మెట్లయినను జింతపడము. కాని స్త్రీలను బరుల కొప్పగింపఁ గలమా! అందువలన నీ వింటనే యుండి నాకు జయము కలుగవలెనని యల్లాను బ్రార్థింపుము. నేను శీఘ్రము గనే జైత్రయాత్రఁ జేసి నీ శత్రువును బంధించుకొని వత్తును.'' అని యభ్యంతరముఁ జెప్పెను.

ఉదయపురి యతని పలుకు లంగీకరింపక యి ట్లనెను. "ఇన్నాళ్ళు నా పొడ గిట్టక ట్లుండి నన్నెడ్పించినది చాలక, యిం కను నేడ్పింపఁ జూచుచున్నారా? ఇఁక నీ విషయమున మీ మాట వినను. రసపుత్రులతోడి యుద్ధమున స్త్రీల కేమి హాని కలుగునో యని చింతింపఁ బనిలేదు. వారు పర కాంతలను మాతృభావమున మన్నించు వా రని మీ రెఱుఁగరా!''

చక్రవర్తి యా మాట లాలించి 'ఓహో! నీకు మహమ్మ దీయులపట్లఁగంటె రసపుత్రులపట్లనే యభిమాన మున్న ట్లున్న దే!' యని పరిహాసించెను. ఉదయపురి యా పరిహాస వాక్యముఁ బరి గణింపక 'మీ రెట్లు భావించుకొన్నను సరే! రసపుత్రవంశమునఁ బ్రభవించిన నాకు రణమన్న భయములేదు. మీరు కదనభూమి యందుండఁగా నేను గృహమున నుండఁజాలను. మదపు టేనుఁగు పై మీ పార్శ్వమున నిలువఁబడి, చిన్ననాఁట నా నేర్చిన శస్త్ర పాండిత్యముచేఁ శత్రువుల యాయుధములవలన మీ యొడలు కసుగందకుండ సంరక్షించుకొందును. స్త్రీ కింతకంటెఁ బవిత్ర మగు కర్తవ్యము వే అొకటి లేదని పలికెను.

ప్రేయసి యట్లు ఖండితముగాఁ బలుకుటచే సార్వభౌముఁ డింకేమియుఁ జెప్పలేకపోయెను. తన పలుకులను త్రోసిపుచ్చు నామె మొగమునఁ జూడ్కులు నిగిడించెను. ఆ మృదూక్తివిశేషము, నా మధురదృష్టిప్రసారము, నా మనోహరమందహాసము, నా యొయ్యారము నతనికి వాగ్బంధ మొనరించెను. ఆ వగలాఁడి యతనిచూపు లరసి 'ఏమట్లు చూచుచున్నారు! నా మనస్సు మాఱిపోవలెనని మంత్రించుచున్నారా!' యని నవ్వెను. ఆ నవ్వు సునిశిత బాణమై చక్రవర్తి ధీరతావర్మమును భేదించెను. మధురభావవివశుఁడై యతఁడు జగము మఱచెను. అతని దృష్టిలో నిప్పు డుదయపురి యొక దివ్యకాంత. తాను క్షుద్ర మానవుఁడు. ఆమె కటాక్షలేశము తనపైఁ బ్రసరించెనేని తాను ప్రణయ సామ్రాజ్యమునకుఁ బట్టభద్రుఁడై యానంద తరంగముల రాయంచవలెఁ దేలియాడును. లేదా దురంత తాప పరివృతుఁడై మనోవ్యథకుఁ బాల్పడును. ఇట్టి తలంపులతో నతని వజ్రకఠినమైన హృదయము మప్పుడు శిరీష కోమల మయ్యెను.

ఉదయపురి యతనివంక హేళనముగాఁ జూచి నిలువు టద్దముకడకుఁ బోయెను. ఔరంగజేబు పెంపుడు పిల్లివలె నామె వెనుక నడచెను.



౯

ఒక శుభముహూర్తమునఁ గుమారసింహుఁడు వాసంతికా రామసింహుల పరిణయోత్సవము మహావైభవముగా నుదయపురమునందుఁ బ్రవర్తిల్లఁ జేసెను. రసపుత్ర చక్రవర్తియు నితరరాజులు పలువురు, నా వివాహమహోత్సవమునకు విచ్చేసి వధూవరుల నాశీర్వదించి బహువిధ కట్నములఁ జదివించిరి. వాసంతిక తన యదృష్టాతిశయమున కెంతయు నానందించెను. రామసింహుఁడు తన చిరకాలమనోరథ మీడేఱినందులకుఁ బరమానంద భరితుఁడయ్యెను. రాజసింహమహీపతి నూత్నదంపతుల కొఱకు దివ్యసౌధముఁ బ్రసాదించెను. నవదంపతు లా రాజసౌధమునఁ బ్రణయసౌఖ్యము లనుభవించుచు దినములు నిముసములుగాఁ గడపుచుండిరి.

వాసంతిక రామసింహుని జీవిత వసంతలక్ష్మి యయ్యెను. ఆ వసంతలక్ష్మి సాహచర్య మతని మనస్సును నందనవన వీధులఁ బరిభ్రమింపఁ జేసెను. అతని కిఁక బాహ్యప్రపంచ మంతయు విస్మృతమైనట్లుండెను. అతని మనస్సు వాసంతికకు భద్రపీఠము. అతని దృక్ప్రసారము లామెకుఁ బుష్పహారములు. అతని నుడువు లామెకు మధురాహారములు. అతని విలాసములామెకు నయన పర్వములు. ఆమె హృదయ మతనికి మహాసామ్రాజ్యము. ఆమె

కటాక్షము లమృత రసాభిషేకములు. ఆమె మాటలు సుధా ప్రవాహములు. ఆమె విలాసములు సౌభాగ్యలక్ష్మీ నృత్యరేఖలు.

రామసింహుని జీవితచరిత్రమున నపూర్వమైన యధ్యాయ మిది. వెనుకటి యధ్యాయములకును, దీనికిని బోలికయే లేదు. ము న్నతనికి విశ్వమంతయుఁ గావలసినదియే. ప్రతియెడఁ దాను సంస్కరింపవలసిన యవసర మున్నట్లు కానఁబడెడిది. తన కర్తవ్య మింత యున్నదని చెప్పుటకూడ నతనికి సాధ్యమయ్యెడిది కాదు. ఆ కార్యభారము నిర్వహించుటకుఁ దాను సహస్రాక్షుఁడును, సహస్రకరుఁడును గావలసియుండు నని యతఁడు తలపోసెడి వాఁడు. ఇంతటి కార్యజాతమునను వ్యక్తిగతస్వార్థముఁ బురస్కరించుకొన్న దొక్కటియును లేదు. దీనజనులెల్లరు నతనికి రక్షణీయులు. దుర్జను లందఱును శిక్షణీయులు. అధర్మము నివార్యము. ధర్మము ప్రతిపాద్యము. సహస్ర ఫణముల భూభారము వహించు నాదిశేషుఁడే యతని కీ కార్యభార నిర్వహణమున లక్ష్యభూతుఁడు. తా నొక యర్జునుఁడు గావలయును. పురాణాభివర్ణితము లయిన బ్రహ్మాస్త్రాది దివ్యాయుధములను సముపార్జింపవలయును. తన తలఁపున కాఘాతము లేదు. తన విక్రమమున కెదురు లేదు. తా నొక్కఁడే భార్గవరామునివలెఁ బరాక్రమించి యధర్మవర్తుల నందఱఁ జిదిమి వేయును. అది యంతయు నొక శౌర్యసముద్ర విహారము.

ఇది కేవలము దానికి భిన్నము. ఇప్పు డతనికి వాసంతికయే లోకము. తన కింకొక దానితోఁ బ్రమేయములేదు. లోకములో

నపేక్షింపఁ దగినది కనఁబడదు. తన్నుఁ దాను సంస్కరింప వలసిన యవసరము కానఁబడుచున్నది. అది తన వేషములో, భాషలో, మిక్కుటముగ నున్నది. విశ్రాంతి యున్నది లేక దేశసంచారము చేయునతఁడు నిజనివాసము విడిచి యాడుఁ గావలఁ బెట్టఁజాలక పోవుచున్నాఁడు. తన కృషి యంతయు వాసంతిక పెదవులపై మందహాసముఁ జిందింపఁ జేయుటకే. తన కష్టమును వేయి కన్నులు గావలయును. కాని యవి ధర్మద్రోహుల కుతంత్రము లన్వేషించుటకుఁ గాదు. వాసంతికా సౌందర్య మవలోకించుటకు మాత్రమే. అట్లే తనకు సహస్ర కరములు కావలయును. కాని యవి దుష్టులఁ జెండాడి శిష్టుల రక్షించుటకై కాదు. ప్రేయసీ లావణ్య సంపద సర్వము సంరక్షించుటకు మాత్రమే. పూర్వము తా నిర్వహించిన కార్యజాతము సమస్తము లోకోపకారకము. నేఁటి తన కార్యజాత మంతయు మనః ప్రియంకరము మాత్రమే. అతఁడు చూడఁగోరునది వాసంతికా ముఖపద్మము మాత్రమే. వినఁగోరునది వాసంతికా ప్రణయ మధురోక్తులు మాత్రమే. వాసంతికా విరహమే యధర్మము. తత్సరస సల్లాప సౌఖ్యానుభవమే పరమధర్మము. రాధాకృష్ణులు, నలదమయంతులు, రతీమన్మథులు, రంభా నలకూబరులు తనకిక లక్ష్యభూతులు. తా నిప్పుడు సంపాదింప వలసినది శృంగార రస విజ్ఞానమొక్కటే కాని శస్త్రాస్త్ర ప్రయోగ కౌశలము కాదు. తన కిప్పు డడుగడుఁగున సందేహమే. ఆ సందేహ మెట్టిది? తమ దంపతుల యనురాగవల్లరి యిది చిరకాల మిట్లు పెంపొందుచుండునా! యనియే. ఈ సందేహ మేల కలుగ వలయును? "అతి స్నేహః పాప శంకీ" యని కదా యార్యోక్తి.

ఒక నాఁ డతఁడు వాసంతికతో నేవేవో తీయని మాటలాడి రేయి సగము కడచు నంతకు నామెను నిదుర వోనీయక పరమార్థ మేమియు లేని ప్రసంగములతోఁ గడిపి యామె నిద్రావశయైనందునఁ దాను మాటాడువారు లేమిఁ గొంతతడవునకు నిద్రించెను. కాని గాఢ సుషుప్తి సిద్ధింపలేదు. ఒక విచిత్ర స్వప్నము వచ్చెను.

తానును వాసంతికయు నొక నదిలో స్నానము సేయుచుండిరి. తాను వాసంతికను విడిచి నదీగర్భములోనికిఁ బోయెను. ఇంతలో నదీప్రవాహమున వడి హెచ్చినది. కెరటము లధికమైనవి. తాను నిలిచినచోటఁ గుత్తుక బంటిగా నున్నది. ఇఁక నీ స్నానముఁ జాలించి తీరమునకుఁ బోవవలె ననిపించెను. అంతలోనే వాసంతిక ప్రవాహవేగము సహింపఁ జాలక నీటఁ బడి కొట్టుకొని పోఁ జొచ్చినది. తా నాతురతతో నామెను సంరక్షింపఁ బోఁ దలఁచెను. మేటి యీఁతగాఁడైనను దాను గాలు గదల్చినంతనే కెరటముల కెదు రీదనేరక కొట్టుకొని పోఁజొచ్చెను. ఎంత వెదకినను వాసంతిక జాడయే కానరాలేదు. తన కలసట గలిగినది. ఈఁదనేరక నదిలో మునిఁగిపోయెను. మునిఁగిన చోటఁ దన కొక స్త్రీ కళేబరము చేతికిఁ దగిలినది. ఆమె వాసంతికయే యైయుండు నని తోఁచెను. అయ్యో! ప్రేయసి మరణించిన దనుకొనెను.

అతఁడు దుఃఖావేశముతో "వాసంతికా!" యని యార్చెను. వాసంతికకు నిద్రాభంగమైనది. పతి దుఃఖవశుఁడై యట్లు కలవరించు టామెకు భయకారణ మయ్యెను. ఆమె భర్తను

వెన్ను దట్టి మేల్కొలిపెను. మేల్కొని నంతనే యతఁడు 'అమ్మయ్య! ఎంత పాడు కల గంటి' ననుకొనెను. వాసంతిక యతని వ్యాకులత గమనించి యా కల యెట్టిదని ప్రశ్నించెను. రామసింహుఁడు స్వప్నానుభవ మామెకు విశదముగాఁ జెప్పి "వాసంతికా! ఈ స్వప్నఫల మెట్టిదో యూహించితివా? మానవాతీతమైన మహాశక్తి యేదో మన కిద్దఱికిని వియోగము గలిగించును. ఇది తప్పదు. మఱియు నిది చతుర యూహమున వచ్చినది కావున నతిశీఘ్రముగనే యట్టి దుష్ఫలితము తటసించును. 'అమ్మయ్యో! ఎంత యాపద రా'నున్నది! సఖీ! నా కొక మాట చెప్పుము. నీ వెప్పుడును నన్ను వీడి పోవుగదా!" యని దీనముగఁ బ్రశ్నించెను. ఆమె యా మాటలకు నవ్వి "మీ రీ నాఁడింత భీరువు లైతి రేమి? కల కల్లయే కాని సత్యము కాదని యెఱుఁగరా! అయినను నేను మిమ్ములను వీడి యెచ్చటికిఁ బోదును? తల్లియూ! తండ్రియూ! తోడఁబుట్టినవాండ్రూ! సర్వము మీరేకదా!" యనెను.

ఇంతలోఁ గొక్కొరో కో యని కోడికూత వినవచ్చెను. రామసింహుని కాతుకత మెండయ్యెను. అతఁడు వీధిలోనికిఁ బోయెను. చంద్రమండల మస్తగిరికిఁ జేరుకొని వెలవెల వోవుచున్నది. చంద్రిక యప్పటి కతని విడిచి వెళ్ళుచున్నది. కళాహీనుఁడైన యా చంద్రుఁడు ప్రేయసీ విరహ పాండురుఁడైనట్లు తోఁచెను. అట్లు తోఁచినంతనే మఱల స్వప్నము మనసులో మెదలెను. "ఈ శశాంకుఁడు చంద్రికాహీనుఁ డైనట్లే నేనును వాసంతికా విహీనుఁడనై యిట్లే కళఁ దొఱఁగిపోవుదును గాఁ

బోలు! తదనంతరమున నితనివలెనే యస్తమింతును గాఁబోలు!" నని విచారించెను. సరిగా నాసమయమున కేకలింగేశ్వరస్వామి యాలయమునుండి ఘంటారావము వినవచ్చెను. "ఓహో! లయ ప్రియుఁ డీశ్వరుఁడు నా కీ గ్రాణము తప్పదన్నట్లు ఘంటారావమున స్పష్ట మొనర్చుచున్నాఁడా!" యని యాందోళన మొందెను.

అప్పటికిఁ బూర్తిగాఁ దెల్లవాఱినది. ఆందోళితచిత్తుఁడైన రామసింహుఁడు చిత్తస్వాస్థ్యము లేక తిరిగి వాసంతికను జూడఁగోరి సౌధములోనికిఁ బోయెను. వాసంతిక యప్పటికే స్నానాదికము ముగించుకొని పీతాంబరము ధరించి దేవమందిరము లోనికిఁ బోవుచున్నది. ఆమె యతనినిఁ జూచి "మీరు నానాఁటికిఁ బ్రపంచమే విస్మరించు చున్నారు. కులదైవతారాధనమునందును వెనుకటి వలె నుత్సుకతఁ జూపుటలేదు. ఈ నాఁ డీస్వప్నముఁ దలంచుకొని కాఁబోలుఁ జింతా విపన్నులైనట్లు మీ మొగము చెప్పుచున్నది. అనిష్ట నివారకుఁడైన స్వామి నర్చించి దైవికముగా రానున్న యపాయమును నివారించుకొన యత్నింప వలయును గాని యూరక విచారపడి చేయఁగలదేమి? వేవేగఁ గాల కృత్య ములు నిర్వర్తించుకొని స్వామి నర్చింప రం" డని పలికెను. రామసింహుఁడును మనసుఁ జిక్కఁబట్టుకొని కాల కృత్యములు దీర్ప నరిగెను.

కుమారసింహుఁ డప్పుడెచ్చటి నుండియో హుటాహుటి నడకల నా సౌధముఁ బ్రవేశించి 'అమ్మా! వాసంతికా! రామ సింహుఁ డెచ్చట నున్నాఁడు?" అని యెలుఁగెత్తి ప్రశ్నించెను. వాసంతిక పూజామందిరము నుండి యీవలికివచ్చి కుమార

సింహునికిఁ బ్రత్యుత్థాన మర్యాద లొనర్చి 'ఇప్పుడే కాల కృత్యములు దీర్ప నరిగినారు. కాని 'అన్నా! అది యే మట్లున్నావు? ప్రమాదమేమియు సంభవింపలేదుగదా!' యని ప్రశ్నించెను. కుమారసింహుఁ డొక్కింత యలసటఁ దీర్చుకొని చిఱునగవుతోఁ 'దల్లీ! మన జీవితమంతయుఁ బ్రమాద భరితముగనే కడచుచున్నది. కావునఁ జింతింపవలసినది లేదు. రామసింహుఁడు కొలఁది నాళ్లుగా రాజకార్యములఁ బాల్గొను చుండుట లేదఁట! రాజసింహ మహారా జతనిలోఁ గలిగిన యీ పరిణామమున కెంతయు నక్కజ మొందుచున్నాఁడు. ఉదయపురీ సమేతముగా నౌరంగజీబు రూపనగరమునకు ససైన్యుఁడై రానున్నాఁడు. అతఁడు రూపనగరముఁ జేరుకొనక పూర్వమే విమలా రాజసింహుల పాణిగ్రహణము నెఱవేర వలసియున్నది. గురుదేవుఁడు సుముహూర్తము నిర్ణయముఁ జేసి తత్క్షణమే రూపనగరమునకు విచ్చేయవలసిన దని మహారాజునకు వర్తమాన మంపెను. నేఁడే మహారా జచ్చటకుఁ దఱలిపోవవలయును. ఢిల్లీలో షాజహాను చక్రవర్తి దివంగతుఁ డగుటచే నౌరంగజీబు ప్రయాణమున కింత యాలస్యమైనది. అదియును గాక షాజహానీ విషయమునఁ గుమారుని మందలించుచుండుట వలనఁ గూడ నౌరంగజీ బిన్నాళ్లాలసించినాఁడు. రోషనారాయును శివాజీ మహారాజుపైఁ బగపూని యతనిని సాధించిన పిమ్మటఁ గాని యితర విషయములనుగూర్చి యాలోచింపవల దని చెప్పినదఁట! కాని వృద్ధరాజు మరణానంతరము పరిస్థితులు మాఱినవి. రోషనారా స్వయముగ శివాజిని సాధింపఁదలఁచి మహారాష్ట్రమున కేఁగినది. ఔరంజీ బుదయపురికిఁ బూర్తిగ వశపడినాఁడు. అయిదాఱు

దినములలో నుదయపురి యతనిని వెంటఁబెట్టుకొని రూపనగరము నకు రాఁ దలఁచినది. ఇంతలోనే విమలా వివాహముఁ బూర్తి చేసికొనవలయును. ఆరావళీ కొండలకడఁ గాచియుండి యౌరం రంగజీబును నిరోధింపవలయును. రామసింహుని సాహాయ్యమున నీకార్యము నిర్వహింపఁ గల ననువిశ్వాసమున మహారాజు చెంత నీ కార్యభారము నాపైఁ బెట్టవలసినదని యర్థించి యను మతిఁ బొందితిని. అనుమతి నిచ్చుటకు మహారా జెంతయో తడ వాలోచించినాఁడు. నే నప్పుడు మిక్కిలి విస్మయ పడితిని. పూర్వ మే యవసరము తటస్థించినను మా యిర్వురిపైఁ గార్యభార ముంచి మహారాజు నిశ్చింతుఁడై యుండువాఁడు. నేఁ డతఁ డింత సేపేల యాలోచింపవలసెనో నాకుఁ దెలిసినదికాదు. నా యా శ్చర్యము గమనించి కాఁబోలుఁ గొంతతడవునకు మహారాజు తన సందేహము వెల్లడించినాఁడు. ఆ సందేహమునకు రెండు ముఖ్యకారణము లున్నవి. మొదటి దిది. తాను మహోత్సాహ ముతో వివాహ మాడఁబోవుచు, సహాయకరమైన కార్యమున మమ్ము నియోగింప వలసివచ్చుట. ఇఁక రెండవకారణ మేదో నేను చెప్పనక్కఱ లేకయే నీవు గ్రహింపఁ గల వనుకొందును.' అని విరమించెను. వాసంతిక లజ్జతోఁ దల వాంచెను.

ఇంతలో రామసింహుఁ డచ్చటికి వచ్చెను. అతఁడు కుమారసింహునిఁ జూచి 'ఓహో! బావా! ఎన్నాళ్ళకు వచ్చితివి? ఇన్నాళ్ళనుండి యెచ్చట నున్నావు? ఏమేమివేషములు వేసినావు? నిన్నుఁ జూడకపోవుటచే నా కేమో మాంద్య మావేశించిన ట్లున్నది. అలసత యధికమైనది. మన్ను దిన్న పామువలెఁ బడి

యుంటిని. నేఁడు నీవు కాన్పించితివి. నాకుఁ గ్రొత్త యుత్సాహ ముదయించుచున్నది. రూపనగరమున కేఁగితివా? ఢిల్లీకిఁ బోయితివా? దేశాంతరమునకుఁ బోవువాఁడవు నాతో నేల చెప్పనైతివి? నేనును నీవెంట వచ్చియుందును గదా!' యని ప్రశ్నవర్షము గురిపించెను.

వాసంతిక యతని మాటలకు నవ్వుచు 'ఓహో! నేఁడు కాలమున కేదో వైపరీత్య ముదయించిన ట్లున్నది. అన్నాఁ భోజుని మొగముఁ జూచిన వారి కందఱికిఁ గపితావేశ ముదయించునట్లు నిన్నుఁ జూచిన వారి కందఱికిని వీరావేశ ముదయించునేమో! లేకున్న వీరి నోటనుండి యిట్టి పలుకు లెట్లు వెలువడఁగలవు. ఇచ్చట నివాస మారంభించుటే మొదలు. వీరు గత చరిత్ర మంతయు మఱచిపోయినారు. నీ వింకదాఁకఁ జెప్పకవిడిచిన విషయము మీదే కాదా!" యనెను.

రామసింహుఁడు కుమారసింహునిఁ జూచి 'బావా! వాసంతిక చెప్పినది నిజమే! నీ మొగముఁ జూచిన వీరావేశము, నా మొగముఁ జూచినఁ బ్రణయావేశము గలిగితీరు' నని నవ్వెను. "వీరావేశమునకుఁ దరుణమైన యీ సమయములో ప్రణయావేశము పరిత్యాజ్య" మని పలుకుచు వాసంతిక యచ్చటినుండి వెడలి పోయెను.

పిమ్మటఁ గుమారసింహునిఁ జూచి, రామసింహుఁడు, 'విశేషము లే' మని యడుగఁగా నతఁ డతనికి రూపనగరముపై మొగలులు దండెత్తనుండుటయు, విమలా రాజసింహుల

వివాహవిషయమును, నారావళికొండలకడ నౌరంగజేబును నిరోధించు కార్యభారము తమ యిరువురిపై నుండుటయును వివరించెను. రామసింహుఁ డప్పుడు 'స్వప్నఫల మప్పుడే యనుభవమునకు వచ్చుచున్న' దనుకొని శంకాకులితచిత్తుఁ డయ్యెను. కుమారసింహుఁ డతనినిఁ జూచి 'రామసింహ! నీ వేదో యనుమానముచే వేధింపఁ బడుచున్నట్లు కాన్పించుచున్నది. నీ మిత్రుఁడనైన నా కా సందేహ మేమో వివరింపుము. నా శక్తికి మించనిదేని నేను దానిని నివర్తింపఁజేసెద' ననెను. అంతట రామసింహుఁడు కుమారసింహునిఁ జూచి 'బావా! దీనికి హేతు విద మిత్థ మని నేను చెప్పఁ జాలను. కాని యల్పకాలముననే యొక ప్రమాదము తటస్థింపఁగలదని నా కొక భయముకలిగినది. నేను నగరములోనికిఁ బోయిన పమ్మట నింటికడ వాసంతిక భద్రముగ నున్నదో! లేదో! దుష్టు లెవరైన నామె కేదేని కీడు గావించిరేమో! యని సంశయింతును. ఆమె నిదురించుచున్నదో శ్వాసమున్నదో! యాఁగినదో! యను ననుమాన ముదయించును. ఏదో విపరీతశక్తి మా కిద్దఱు కెడఁబాటు గల్గింప వేచియున్న దను భీతి యకారణముగనే నన్నావేశించినది. పాపము! దిక్కులేని వాసంతిక నన్నుఁ బ్రాణపదముగా భావించుకొనుచున్నది. నా భయమే సత్యమయిన నామె గతి యేమి కావలయును? ఈ మాట విను. నేఁటి తెల్లవాఱుజామున నామెయు నేను నొక యేటఁ దాన మాడుచున్నట్లును, ప్రవాహ వేగ మాకస్మికముగా హెచ్చి యామెకు నేనును, నా కామెయుఁ గాక కొట్టుకొని పోయినట్లును, దుట్టతుదకు నేను జలములలో మునిఁగి పోఁగా, నీటి యడుగున నొక స్త్రీ కళేబరము తాఁకి నట్లును;

నా స్త్రీ వాసంతిక కావచ్చునని నీ నడలి నట్లును; స్వప్నము వచ్చినది. స్నానము చేయుచున్నట్లు కల వచ్చుట యరిష్టసూచకము. ప్రవాహవేగ మది మానవాతీతశక్తి, మమ్ములను వేఱుపఱచినది. నేను నీట మునిఁగినప్పటికే వాసంతిక మునిఁగి పోయె ననఁగా, నేను జీవించియుండఁగనే వాసంతిక నా కెడమాసని యర్థము. ఆమె కళేబర మది యగు నని యనుకొనుటయే; కాని, కన్నులతోఁ జూడక పోయినందువలన నా కామె కళేబరముగూడఁ గాన్పింపదు. బావా! నా కలయును దాని ఫలితమును నిట్టివి. బాల్యమునుండియును భవిష్యదర్థములు నాకుఁ గలలో గోచరించుచుండుట గలదు. అందువలన వెనుకటికంటె నీ యుదయమునుండియు రాఁబోవు సహాయ మూహించి నా హృదయము తల్లడిల్లుచున్నది.”

కుమారసింహుఁ డతని వాక్యములు విని యేమో యాలోచించుచుండెను. రామసింహుఁడు నధోముఖుఁడై శిరఃకంపము సేయుచు సంకల్ప వికల్పముల నడుమఁ గొట్టుకొనుచుండెను. ఇంతలో వాసంతిక యచ్చటికి వచ్చెను. రామసింహుఁడు తలయెత్తి యామెను జూచెను.

# ౧౦

ఆమె మునుపటి వాసంతిక కాదు. ఆ వాసంతిక బ్రతుకాశానిరాశల నడుమ నల్లాడునది. నాఁటి యామె భావ ప్రపంచ మతిపరిమితము. తానును దన దండ్రియు మాత్రమే యా ప్రపంచములోని పౌరులు. మూఁడవ వ్యక్తి నీడ మాత్రమే కనఁబడినది. ఆ నీడ యెవ్వరి దని పరీక్షించి చూచు నప్పటికిఁ దన ప్రపంచములోని జనసంఖ్యలో నర్థభాగ మదృశ్యమైనది. ఆ యొంటరితనము మనసునకుఁ దోఁచియుఁ దోఁచని స్థితిలో మున్న తా నేవ్యక్తి ఛాయఁ జూచినదో; యా వ్యక్తియే సందర్శన మిచ్చినాఁడు. మఱల యథాపూర్వముగాఁ బౌరు లిద్దఱైనారు. ఒకప్పుడు తండ్రి కూతుండ్రు. పిమ్మట భార్యాభర్తలు. తొలుతటి యంకమునఁ గరుణారసము మాత్రమే. రెండవ యంకమున శృంగారరస మాక్రమించినది. ఇపు డా జీవితనాటకమున మూఁడవ యంకము ప్రవేశించినది. ఈ యంకము మొదటిరంగము భయానక రసముతో నడుఁగు పెట్టినది. ఈ ఘటికయందే రెండవ రంగమేర్పడి భయానకరసమును నెట్టి వీరరస ముద్భవించినది. జీవిత దృశ్యకావ్య మిది యీ మూఁడవయంకముతో ముగియునో! చతుర్థాంకమునకు స్థానమున్నదో! ఊహించుట కలవి గాక యున్నది.

రామసింహ కుమారసింహులు లామె వదనమం దొక యలౌకిక తేజోవిశేషముం జూచిరి. ఆమె ముఖపద్మము సుప్రసన్నమై భావతరంగము లన్నియు నణంగి, యేదో యొక దృఢ నిశ్చయము నొనరించి కొన్నట్లు గోచరించు చుండెను. పదునెన్మిది వసంతములైనఁ గడవని యా చిగురుఁబోఁడి కాలచక్రపరివర్తిత మైన యావద్వసంతమాధుర్య మనుభవించి, రోసి కేవలబ్రహ్మానంద రసాస్వాద నోల్లాసిని యైన మహాయోగినివలె వెలుఁగొందు చుండుటంజేసి, వాసంతిక యను నిట్టిద కాంతిగోలు; నని వారికిఁ దోచెను. ఆమె నిలిచినంతమేఱలోఁ దేజోవలయ మొకటి మర్నికీర్ణమై వెలుఁగొందుచున్నట్లుండెను.

ఆమె యంతటఁ గుమారసింహుని మొగమునఁ జూచి నిలిచి యిట్లనెను. "అన్నా! భూత భవిష్య ద్వర్తమానములలో వర్తమాన మొక్కటే మనకు విచారణీయము. మీ సంభాషణ మంతయు వింటిని. క్షణికమైన జీవిత మిది. సత్కార్యనిర్వహణమునకు మాత్రమే వినియోగ్యము. అవకాశము లిట్టివి కోరిన నప్పుడు రావు. వచ్చినప్పుడు తర్కవితర్కములతోఁ గడపి కార్యాచరణఫలమును దక్కించుకొనలేక పోవుట శోచనీయము. నేఁడు మొగలుపాదుషాను మార్గమధ్యముననే నిరోధింపఁబోవుట మృత్యుదేవత నాలింగన మొనర్పఁ బోవుటే యని నేను గ్రహించితిని. అయినను మన తుచ్ఛశరీరములపై నపేక్ష వెట్టుకొని, మాతృభూమికిఁ గలుగనున్న దుస్థితి నివారింపక, యుపేక్షించుటకంటె నకార్యము మఱియొకటి లేదు. ఏ వీరమాళి, దేశీయ జనోద్ధరణమునకై తన ప్రాణముఁ దృణప్రాయముగా

నెంచి, మ న్ననేక పర్యాయములు మృత్యువుతోఁ జెలగాట మాడెనో; యట్టి నా ప్రాణేశ్వరుఁ డీనాఁడు కేవలము నాపైఁగల వ్యామోహము పెంపున దేశహితము నుపేక్షించెననుట; నేను విని మనఁజాలను. కావున నేను గూడ రణభూమికి మీతో వచ్చెదను. గెలుపు గలుగుట కలలోని వార్తయే యనుకొందము. దైవికముగా జయించితిమా! రాజపుత్రస్థానమంతట సమ్మానిం పఁబడుదుము. మరణించితిమా! వీరస్వర్గములోని రాజపుత్ర లోకమును సందర్శింపఁగలము. కీర్తిశరీరములతోఁ జిరకాల మిహ మున జీవింతుము. కాఁబట్టి నామాట విని మన ప్రయాణమునకుఁ దగిన ప్రయత్నము లొనరింపుము."

కుమారసింహుఁ డా పలుకులు విని "తల్లీ! నీ స్వభావము నే నెఱుఁగుదును. కాని నే నింకను జీవించియే యున్నాను. నేను లేనినాఁడు మాత్రమే నా సోదరి కరవాలధారణము సేయఁగలదు. సమాచార మిట్టిదని యెఱిఁగించుటకే నేను వచ్చితిని గాని రామసింహుని నాతోఁ దోడ్కొని పోవలయు నని కాదు. అతఁ డును సహజమార్దవమున నీ భవిష్యత్తునుగూర్చి కొంచె మాలో చించెనే కాని రణమునకు వెఱచి కాదు. అదియునుగాక రాజ సింహ మహారాజులుగూడ రామసింహునిఁ గదనభూమికిఁ గొని పోవు విషయమై యంతగా నిష్టపడలేదు." అను నంతలో రామ సింహుఁడు "బావా! ఏమంటివి? నన్నుఁ గదనభూమికిఁ బంపు టకు మహారా జిష్టపడలే దనియా!" నేను భీరువు ననియా! దేశ భక్తిశూన్యుఁడ ననియా!" యని యావేశముతోఁ బలుకఁగా వాసంతిక 'కాదు. కాదు. నాథా! మహారాజు హృదయము

మీరు గ్రహించినవారై కూడఁ బ్రోవవలె చున్నారు. ప్రమాద నిశ్చయము గల యీ వ్యాపారమున మిమ్ము నియోగించుటకు మీ యందరి ప్రీతివలన మాత్రమే యూకున వెనుకాడెను. కాఁబట్టి మీరు వట్టి యనుమానములకుఁ దావీయక కర్తవ్యపరాయణులు కండు!' అని, కుమారసింహునిఁ జూచి, 'అన్నా! నా ప్రయాణమునకుఁగూడ ననుమతింపు' మనెను. కుమారసింహుఁడు 'సాదరీ! అట్లు కాదు. ప్రస్తుతోద్యమము కొంతవఱకపాయకరముగాఁ గన్పట్టుచున్నను, విజయము మాత్రము నిశ్చయము. రెండు దినము లౌరంగజేబును నిలువరించితిమేని మూఁడవనాఁటికి మహారాజే యచ్చటికి వచ్చును. అప్పటికి మనమిత్రరాజుల బలగమంతయు నచటికిఁ జేరుకొనఁగలదు. అయినను నీ కార్యమునకు నేనొక్కఁడను జాలుదును. కాని,' యనుచుండఁగనే రామసింహుఁ డడ్డగిలి 'బావా! నీ మాట లిఁక చాలింపుము. మన మిర్వురము గలిసియే పోవలయును' అనెను.

వాసంతిక యతనిమాటలు విని సంతుష్ట యయ్యెను. వీర పత్నిగాఁ దాను లోకమున సంభావింపఁబడఁగల యవకాశము లభించె ననుకొనెను. ఆమె లోని కరిగి, పతిదుస్తులు గొనితెచ్చి, యీయఁగా, నందుకొని, రామసింహుఁడు చిఱునగవుతో నామెను జూచి, 'సఖి ఆయుశ్శేషమున్నచోఁ దిరిగి నిన్నుఁ జూతును. లేదేని రసపుత్ర యువతికి నీకుఁ జెప్పవలసినది లేదు గదా! ఇదే మన కడసారి చూపు.' అను సంతలో నతని కంఠము రుద్ధమయ్యెను. కన్ను లార్ద్రము లయ్యెను. ఆమెయు నా పలుకులు విని క్షణమాత్రము నీరవ యయ్యెను. మఱల జిత్తస్వాస్థ్యము

వహించి, 'మీ రూరక యధైర్యపడుచున్నారు. మనకు వియోగ మనునది లేదు.' అని పలికి, చందన తాంబూలాదులను, ఖడ్గమును దెచ్చి, యతని కందిచ్చి, నుదుటఁ దిలకము వెట్టుచు 'వాసంతిక వీరపత్ని యనిపింపుఁడు. ఇదే! మీ ప్రేయసి మీ నుండి వాంఛించు బహూకృతి.' యనియెను.

పిమ్మట రామసింహ కుమారసింహులు వాసంతికను వీడ్కొని తమ కొఱకై నిరీక్షించు సైనికులఁ గలియ నరిగిరి. వాసంతిక సౌధాగ్ర మధిరోహించి వారిని గమనించు చుండెను. రామసింహుఁడును, ప్రేయసీ ముఖావలోకన కుతూహల మగ్గ లమై, మాటిమాటికి వెనుదిరిగి చూచుచు, విధి బలవంతమై పట్టి యీడ్చుకొని పోవుచుండ నల్లాడు జీవునివలెఁ బోలేక పోలేక పోవుచుండెను. తాఁ గన్పించుచున్నంతవఱ కతనికి వెనుకచూపు తప్ప దనుకొని వాసంతిక క్రిందికి వచ్చెను.

పరిచారకు లెచ్చటెచ్చటనో యుండిరి. ఆమె కప్పుడు తా నేకాకిని నైతి నను భావము కలిగెను. ప్రాణాధికుఁ డైన నాథుని యెడఁబాటు దుస్సహ మను తలంపును బుట్టెను. తన్ను విడువలేని ప్రేమమూర్తి పట్లఁ దాను రాక్షసివలెఁ బ్రవర్తించినట్లు తోఁచెను. అటు తోఁచుటతోడనే గుండె చెఱు వయ్యెను. అతని ప్రణయలీల లన్నియు నొక టొకటిగా జ్ఞప్తికి వచ్చెను. అప్పు డామె యి ట్లనుకొనెను.

'అభాగ్యురాలా! వాసంతికా! పుట్టినప్పుడే తల్లిని బరలోకమునకుఁ బంపితివి. పెరిగి పెద్దదాన వైతివో లేదో తండ్రినిఁ దఱలించితివి. పత్నివై యింట నడుఁగిడిన క్రొత్తఁదన మైన

నాయకముందే పతిని మృత్యుముఖమునకుఁ బంపితివి. ఒక్కొక్కరి పుట్టువునుండియు బంధుమిత్రుల కభ్యుదయ పరంపరలు గలుగును. మఱికొందఱివలన నితరుల కెవ్వరి కేమాత్రము మేలు గలుగదు. నీవంటి దౌర్భాగ్యమూర్తి మాత్రము లోకములో నెచ్చటను నేకాలమునను బుట్టదు. వీరపత్నివి కాఁగోరి నీ భర్త నస్థిశేషమునఁ ద్రోయుదువా! నీకుఁ బ్రతిష్ఠాపేక్ష యున్నచో నీ శౌర్యమువలనఁ గీర్తి గడింపవలెనే కాని, యితరులను హింసించుట వలన గడింప నెంతువా! అయ్యయ్యో! పరహింసవలన స్వకార్యము సాధించు నీవు దానవివి గాని మానవివా! ఛీ! ఛీ! నారీరూపరాక్షసీ! ఏటికే యీ పాడుబ్రతుకు! కలలో నీవు మరణించినట్లు కానిపించుటకే నీ భర్త యెంతగా వ్యాకులితుఁడయ్యెనే! అతఁ డట్టివ్యాకులత యెన్నఁడైన నెఱుఁగునా! నీయందలి ప్రేమవలననేగదా! అట్టి నిర్మల ప్రణయమూర్తి పట్ల నీప్రవర్తన మిట్టిదా! ప్రణయమూర్తి పట్ల బ్రళయమూర్తి వైతివికదే!"

ఇంతలో వీధిలో సైనికులసందడి వినవచ్చెను. ఆమె వేవేగ సౌధాగ్ర మధిరోహించి చూచెను. రామసింహకుమారసింహులు పురోగాములగుచుండఁ బలువు రాశ్వికులు వారి వెనుక నరుగుచుండిరి. రామసింహుఁ డామెను జూచెను. అతని చూపామెకు హృదయభేదక మయ్యెను. ఆమె కన్నులవెంట బాష్పము లేకధారగా స్రవించెను. కుమారసింహుఁడు నామెను జూచెను. అతఁడు రామసింహునికి మెల్లగా నేమో చెప్పెను. రామసింహుఁ డతని పలుకులు నిర్లక్ష్యము సేసినట్లు శిరఃకంపము గావించెను. వాసంతికకు ధైర్యముఁ జెప్పుచున్నట్లొక చిఱు

నవ్వు వినఁబడెను. ఆమెయును శోక మొకమూలకుఁ ద్రోచి యొక మందహాసము చేసెను. కాని యా హాసరేఖ కృష్ణచతుర్దశినాటి జ్యోత్స్న. క్రమముగాఁ బ్రాణేశ్వరుఁడు దూరమైనాఁడు. వాసంతిక నిలువునఁ గూలఁబడిపోయినది. పరిచారిక లామె నన్వేషించుచు వచ్చి యనుసరించి లోనికిఁ గొనిపోయిరి.

ఎవ రెంత వేడుకొన్నను నాఁడు వాసంతిక భోజనము చేయలేదు. చేయునది లేక దాసీజనము తమ ప్రయత్నము విరమించి చింతాపరవశమై యున్నంతలో ద్వారపాలకుఁ డొకఁడు లోనికి వచ్చి వాసంతికను జూచి 'అమ్మా! ప్రభువుకడ్డనుండి వార్తాహరుఁ డొకఁడు వచ్చి మీ దర్శన మపేక్షించుచున్నాఁ' డనెను. ఆమె యాందోళిత చిత్తయై 'వెంటనే వానిని దీసికొని ర' మ్మనెను.

వార్తాహరుఁడు వచ్చుచునే యామెకు నమస్కరించి యధోముఖుఁడై నిలువఁబడెను. వాని ముఖలక్షణములను జూడఁగా నేదో దుర్వార్తఁ దెచ్చినట్లుండెను. ఆమె యతని స్థితిఁ జూచి భయకంపితయై 'ఏమోయీ! అట్లున్నావు! ప్రభువు కుశలియేకదా!' యని యడిగెను. నాఁ డంతట గద్గదకంఠుఁడై 'అమ్మా! ప్రభువులకు సేమమే! కాని యీ సందేశము మీ కెట్లు చెప్పుదును! అందఱు సేవకు లుండఁగా నీ వార్తఁ దెచ్చుటకుఁ బ్రభువునకు నేనే కనుపింపవలెనా!' అని యాఁగెను. పరిచారిక లంతట 'వీఁడు తెచ్చిన సందేశ' మేమై యుండునా! యని కలవర పడఁజొచ్చిరి. నాథునిక్షేమవార్త తెలిసినది గనుక వాసంతిక

కొంత ధైర్యముఁ దెచ్చుకొని "ప్రభువులు సేమముగ నున్నారంటివి. ఇం కెట్టి దుర్వార్తయైనను నేను వినఁగలను. ప్రభువు నీకేమని యాజ్ఞాపించెనో సందేహింపక తెల్పు' మనెను. వాఁడను మానముగాఁ బరిచారికలవంకఁ జూచెను. వాసంతిక యతని యభిప్రాయ మెఱింగి, 'మీ రావలకుఁ బొం'డని, వారిని దూరముగాఁ బంపి 'ఇప్పుడు చెప్పుము. ప్రభువు నా కంపిన సందేశ మేమి?' యని యతని నడిగెను.

వాఁ డప్పుడు మెల్లగా నిట్లు చెప్పఁ బ్రారంభించెను. 'తల్లీ! ఎప్పు డీకార్యమున కంగీకరించితినో యప్పుడే నా గుండె ఱాయిఁ జేసికొంటిని. ఇఁకఁ జింతించి ప్రయోజనమేమి? ఔరంగజేబు మహాసైన్యముతో బయలుదేఱి వచ్చుచున్నట్లు వేఁగులవాం డ్రెఱింగించిరి. తెల్లవాఱునప్పటికిఁ బోరు ప్రారంభమగును. కాని మనసైన్యము శత్రుసైన్యమునఁ బదియవ వంతైన లేదు. గంగాప్రవాహమును బిడికెడిసుకతో నిరోధింపఁ బోవుట వంటిది; మన మతని నిరోధింపఁబోవుట. కాఁబట్టి జయము కలుగునను నాస లేదు." అని కొంత సేఁపాగెను.

ఆమె యంతట 'నిది పూర్వమే నిశ్చయమైనది. క్రొత్త విశేష మేమి?' అని ప్రశ్నించెను. వాఁ డప్పుడు కొంత ధైర్యముఁ దెచ్చుకొన్నట్లు ప్రసంగ మిట్లు నడపెను.

'అమ్మా! రసపుత్రవీరుల వ్రతము మీ రెఱిఁగియే యుందురు. వారు రణమున వెన్నీయరు. ఒక్కఁడు మిగిలి

యున్నను శత్రువుతోఁ బోరి వీరస్వర్గమునకే పోవునుగాని గృహమునకు మరలి రాఁడు.'

మరల వాని నోరు మూఁత వడెను. ఆమె వాని ఘోర ణికిఁ గొంచెము కోపించి 'ప్రభుని సందేశ మేమో వినిపింపక వ్యర్థ ప్రసంగముతోఁ గాలహరణ మొనర్తు వేమి?' యని తీవ్రముగా నడిగెను.

వాఁ డప్పుడు మహాదుఃఖవశుఁ డైన ట్లుండి తుద కిట్లనెను. 'అమ్మా! ప్రభువుల సంకల్ప మిది. వారు వీరస్వర్గముఁ జేరు కొన్నట్లు తెలిసిన వెంటనే తాము సహగమనము సేయవలయును. ఇట్లని మీకుఁ జెప్పవలసిన దనిరి.'

వాసంతిక యా మాటలు విని 'ఇంతేనా! ఇంకేమైన నున్నదా!' యని యడిగెను. అంతట వాఁడు వినయమున నిట్లనెను. "'దేవీ! ప్రభువు లేలకో యనుమానపీడితు లైనట్లున్నారు. తాము కేవలమగ్నిహోత్రమువంటివారే! వారికీ యనుమానమేల కలుగవలయునో! ఈయనుమానము వలననే వారి కెంతమాత్రము రణోత్సాహ మున్నట్లు కనఁబడదు. ఈ శంకయే వారికిఁ గలుగ దేని సవ్యసాచివలె శత్రువులఁ జీల్చి చెండాడి, విజయలక్ష్మినిఁ జేపట్టఁ గలరు. ఆ శంకవలననే యిట్లు నీరసులై యున్నారు. ఇట్టి నైరస్యముతో యుద్ధమునఁ బాల్గొన్నను నపజయము కలుగును గాని జయము కలుగదు. మీ రిప్పుడు వారి కా యనుమానము నకుఁ దావులేకుండఁ జేయవలయును.''

ఈ మాటలు వాసంతికను బల్లెపుఁ బోటువలె నాటుకొనెను. భర్త తన శీలమును సందేహించెనా! ఆ సందేహము వలననేనా! ఖడ్గ మందిచ్చుటకు ము న్నాయుశ్శేష మున్నచోఁ దాఁగి చూతును. లేనిచో రసపుత్రయువతివి నీకుఁ జెప్పవలసినది లేదుగదా!' యనుట! అయ్యో! అప్పు డామాటల కర్థ మిట్టి దని తన కేల స్ఫురింపకపోయెను? స్ఫురించియున్నచో నప్పుడే ప్రాణత్యాగ మొనర్చి యాయన సందేహమును నివారించి యుండెడిదే! అది యంతయుఁ దనయందలి యనురాగగుణమే యనుకొనెను గాని, తన సహగమన విషయమైన సంశయ మని తెలియదయ్యెనే! యుద్ధమునుండి నాథుఁడు తిరిగి వచ్చుచోఁ జూచి యానందింప నచ్చుననియే తాను జీవించియున్నది; కాని, ప్రాణములపైఁ గోర్కె వలనఁ గాదే! పతి యింతమాత్ర మూహింపఁ డయ్యెనే! తా ననుమానించుటే గాక యల్పమతులైన యిట్టి సేవకులతోఁ గూడఁ జెప్పెనా! ఇట్టి మాటలు విని తానేల బ్రతికియుండవలెను? ఎవని సందర్శన సల్లాప సమావేశము లపేక్షించి ప్రాణములు నిల్పి యున్నదో; యట్టి ప్రాణేశ్వరుఁడే తన్నొక నీచురాలినిగా భావించి నాఁడా! ఇఁక బ్రతుకఁ గూడదు. తత్క్షణమే ప్రాణత్యాగ మొనర్చుకొనవలయును. అప్పుడే తనకు సాధ్వీలోకమున స్థానము కల్గును. మఱియు నీవార్త విననేని నిశ్చింతుఁడై రణమొనర్చి నాథుఁడు విజయలక్ష్మీ సమేతుఁడగును. అతని భవిష్యజ్జీవితము మహోజ్జ్వలమై తనరారును. తన తలఁదన్నిన యువతి నతఁడు పరిణయమాడి సుఖించును. భర్తృ పునస్సమావేశ మపేక్షించి తాను జీవించి యున్నదేని యనుమానపీడితుఁ డగు నతఁ డుత్సాహముతో రణమొనరింపనేరక నశించుట నిశ్చయము. భర్త జీవింపవలె నన్నను

గీర్తిశాలి కావలె నన్నను దాను మరణింపవలయును. సాధ్వికి నాథుని శ్రేయస్సుకంటెఁ గావలసినదేమి?

ఆమె మన స్సీ తుదిమెట్టు దగ్గఱనిలిచి యాలోచన ముప సంహరించెను. వెంటనే యామె లోనికిఁబోయి నాథుని పేర నొక కమ్మ వ్రాసి తెచ్చి యా వార్తాహరుని కిచ్చెను. వాఁడతి వినయముగా నా లేఖ నందుకొని యామెకు నమస్కరించి మెల్లగా గమనోన్ముఖుఁ డయ్యెను. అప్పుడామె యతనినిఁ జూచి 'సోదరా! ఒక్క క్షణ మాగుము. నా ఖండిత మస్తకము నాథుని కడకుఁ గొనిపోవలసి యున్నది' అని పలికి, వాఁడు వెనుదిరిగి చూచునంతలో వాఁడి కటారితోఁ దన శిరస్సు ఖండించుకొనెను. దివ్యతేజోరేఖ యొకటి యంతరిక్షమున కెగసెను. దక్షాధ్వర విధ్వంసనోదగ్రవీరభద్రచరణాహతకలానిధివలె వాసంతికా ముఖ పద్మ మిలాతలముపైఁ ద్రుళ్ళిపడియెను. ఆ వార్తాహరుఁడు తన చేతిలోని జా బచ్చటనే జాఱ విడిచి, భయాకులితచిత్తుఁడై పఱువెత్తెను.



౧౧

ఆరావళి కొండల కావల నల్లంత దూరమునఁ బట కుటీరములో నుదయపురి సుఖాసీనయై యుండి చెలికత్తె మాధు రితో నిట్లు ముచ్చటించు చుండెను.

'పదునెనిమిదేండ్లయిన నిండని యా బాలిక కంత సాహస మెట్లు గలిగినదే. నీవు వెనుదిరిగి చూచునప్పటికే శిరస్సు ఖండించుకొన్నదా! అయ్యో! నా సంకల్పము నెఱవేఱినదికాదే. దానిని జీవములతోఁ బట్టితెచ్చి యొక మహమ్మదీయ యువకున కొప్పగింపవలె ననుకొంటిని. ఇఁక విమల మాత్రమే యున్నది. ఇది యేమగునో!'

"అట్లు జరుగునని నేను కలలోనైనఁ దలంప లే దమ్మా! పరిచయమేర్పడినపిదప రెండుమూఁడు దినములలో నామెను వల లో వైచికొని పతికెడఁబాపి మీ చెంతకుఁదీసికొని రాఁగలనను కొంటిని. కాని, అమ్మా! మన మిర్వురము మాత్రమే యీ రస పుత్రవంశమునఁ దప్పబుట్టితి మనుకొందును."

"ఏమే! అట్లందువు?"

"పంకమునఁ బుట్టిన పద్మినికిఁ బంక మంటక పరిమళము గలిగినట్లు రసపుత్రవంశమున జన్మించియు జాతిసహజ దురభి

మానము కలుగకపోవుటయు, హృదయవైశాల్య మేర్పడుటయు, మన మిందుఁ దప్పఁబుట్టితిమనుటకుఁ దార్కాణము గాదా!

'మాధురీ! వాసంతి కాపహరణమువలన మనకు విజయము కలుగు నని నీ వెట్లూహించితివి?'

'అమ్మా! వాసంతిక రామసింహునికిఁ బ్రాణము. రామసింహుఁడు కుమారసింహునికిఁ బ్రాణాధికుఁడు. కుమారసింహునిపై రూపనగరసంస్థాన భాగ్య మాధారపడియున్నది. రూపనగర నిమిత్తమై యుదయపురీశ్వరులు తమ ప్రాణము లర్పింప సిద్ధపడియున్నారు.'

'మాధురీ! నీ వుదయపురీశ్వరు లనుటలో నా కపార్థము స్ఫురించుచున్నదే! నీ నోట నిట్టిమాట యేల వెడలవలయును?'

'అమ్మా! ధీరహృదయవు గదా! నీ కున్నంతపాండిత్యము నాకు లేక యేదో మాట యన్నందుల కేవో యర్థములు కల్పించుకొని బాధ పడవచ్చునా!'

'ఒక్కొక్కప్పుడు భవిష్యదర్థము మన వాక్కులలోనే బయలుపడుచుండు నందురు. అందువలన నుదయపురి యనుపేరు గల నాకుఁ బ్రాణేశ్వరుఁ డైన పాదుషా రూపనగరనిమిత్తమై తనప్రాణము లర్పింప సిద్ధపడె నను నర్థము నీ నోట నీశ్వరుఁడు పలికించెనేమో! యని భయపడుచున్నాను. ఇది యీ రాజసింహునికే వర్తించెనేని నాకు విచారముండదు. అది యటుంచి దీనికి జవాబు చెప్పుము. వాసంతి కాపహరణ మాత్రమున రసపుత్రవంశప్రభవుఁ డైన రామసింహుఁడు బేలయై కర్తవ్యము విస్మరించు నందువా?'

"రామసింహునికి వాసంతికను జేపట్టిన పిమ్మట నామె సాన్నిధ్యమే వాంఛనీయ మైనది. ఆ వీరోత్సాహ మంతయుఁ బ్రణయోత్సాహముగాఁ బరిణమించినది. వాసంతికను వీడి యుద్ధరంగమునకు వచ్చుట కతఁ డెంత చింతించెనో దాసీ రూపమున నచ్చటనున్న నేను గమనించితిని. వాసంతిక ప్రోత్సహింపకున్న నతఁ డిచ్చటికి వచ్చెడి వాఁడు కాఁడు.''

"ఇప్పుడు రామసింహుని కీ వార్త తెలిసియుండునా?"

"ఏల తెలియదు?"

"అయినచో నతఁడు యుద్ధరంగము విడిచిపోవునుగదా? కుమారసింహుఁ డొక్కఁ డేమి చేయఁగలఁడు?

"అతఁడు కూడ రామసింహు ననుసరించు ననియే నా యూహ."

ఇంతలోఁ బాదుషా వచ్చుచున్న యలజడి వినిపించెను. మాధురి రాణియొద్ద సెలవుదీసికొని యవ్వలికేఁబోయెను. ఉదయపురి భర్త కెదురువోఁ దలంచునంతలో నతఁడే యచ్చటికి వచ్చెను. ఉదయపురి యతని ముఖలక్షణములను జూచి యతఁ డేలకో యాశ్చర్యవశుఁడైనట్లు గమనించి 'ఏమట్లున్నారు? రూపనగరపు వార్త లేమైనఁ దెలిసినవా?' యని చిఱునవ్వుతో నడిగెను. అతఁ డంతట నామెతో నిట్లు సంభాషించెను.

"ప్రియా! విమలకు రాజసింహునితో వివాహము జఱుగుచున్నదఁట! నీపంత మిఁక జెల్లదు."

"వివాహమైనంత మాత్రమున దానిని సుఖపడనిత్తునా! దానిని ప్రాణములతోఁ బట్టితెచ్చి మీ యంతఃపుర దాసిని గావింపక నేను నిదురింపఁగలనా?

"ప్రేయసీ! పరిస్థితు లనుకూలముగా లేవు. ఇచ్చటినుండి మన మొక కొండలోయలోఁ బ్రయాణ మొనర్పవలయును. ఆ మార్గము కడు నిఱుకైనది. ఆ మార్గమున కవ్వలివైపున మనల నెదిరించుటకొఱకు రసపుత్రసేన వచ్చుచున్నది. ఆ సేన చేరు కొనకపూర్వము మన మీ లోయ దాటితిమేని జయము నిశ్చయము."

"లేనిచో?"

"మనము చిక్కుపోయినట్లే!"

"మీ రేమియు నధైర్యపడ నక్కఱలేదు. మాధురి యిప్పుడే యటనుండి వచ్చినది. ఆ సైన్యాధిపతి భార్య గతరాత్రి యం దాత్మహత్య చేసికొన్నది. అతఁ డింక వెనుకకే పోవును గాని మీతో యుద్ధ మొనర్పఁడు."

"ప్రియా! ఎంత చక్కనివార్త చెప్పితివి? ఈ సమాచార మే తెలియకున్న నే నింకఁ గొలఁది నిముసములలో వెనుకకు మఱలుఁడని మనవారి కాజ్ఞాపించియుందును. అల్లాకు నాయం దుఁ బరిపూర్ణ కటాక్షముండుటవలనఁ బలాయితుఁడ నైతి నను నపయశము నాకు రానీయక యీమాట వినిపించినాఁడు. నేను రూపనగరరాజు పెండ్లికిఁ దఱలి రమ్మని వర్తమానమంపుటచేఁ ద్వరితముగ నల్ప పరివారముతో బయలు దేఱితిని. లేకున్న మహా

రాష్ట్రమునుండికూడ సైన్యములను రప్పించి యీ దుష్టులకు బుద్ధిఁ జెప్పించియుందును.''

"ఇప్పుడు మన బల మెంతయున్నది?"

''ఎంత యున్నదను ప్రశ్న మనవసరము. ఈ రాజపుత్రుల నోడించుట కిది చాలును. కాని యుద్ధార్థియై వేంగలు చక్రవర్తి యింత స్వల్పసేనతో బయలుదేఱఁడు.''

''ఆలంగీరు పాదుషా రణరంగమున నిలిచెనేని సైన్యమున్న నేమి? లేకున్న నేమి? ఆయన నేత్రకోణశోణరుచులే శాత్రవారణ్యమునకు దావాగ్ను లగును.''

"ప్రేయసీ! నీవాఙ్మాధుర్యము వర్ణనాతీతము. కాని నే నొక్కటి చెప్పెదను. ఎవని కంటిమెఱుపు శత్రువనావళిని దగ్ధ మొనరించునో! సకలభారతమున నెవని కత్తి కెదురులేదో! వాఁడు నీ పాదదాసుఁడే యన్నప్పుడు నీ మహిమాతిశయము నేమన వచ్చును?"

"మీరు బాహుబలముచేతనే గాక వాదబలముచేతఁ గూడ నజేయులే!''

''రాణీ! నీ మాటలు వినుకొలఁదియు వినవలె ననియే యుండును. ఈ యానందములోఁ గార్యము మఱచిపోవుదు నేమో! వెంటనే లోయదాఁటి పోవలెనని సైన్యాధిపతుల కాజ్ఞాపించెదను.''

పిమ్మటఁ జక్రవర్తి భార్యను వీడుకొని స్కంధావారమున కరిగి తత్క్షణమే లోయదాఁటి పోవలసినదని యుత్తరు విచ్చెను.

చక్రవర్తి నోటినుండి మాటవచ్చుట తడవుగా సైనికుల కెల్లర కీది వినిపించుటయు, నెవరికి వారు ప్రయాణ సన్నద్ధులగుటయు, నల్ప కాలములో జరిగెను. ఒక్క గంట క్రిందట నొక మహానగరము వలె నున్న యా ప్రదేశము, పటకుటీరము లదృశ్యములు కాగా యథారూప మేర్పడి, తాత్కాలిక భోగనష్టమునకు వికార మందని మహాయోగి మానసమువలెఁ బ్రశాంతమయ్యెను. మద గజారూఢుఁడై పురోగామియగు చక్రవర్తి సితచ్ఛత్రము ఫణా యుతమై ప్రకాశించుచుండ నొక్కఁ డొక్కఁడుగా నెంట నరుగు చున్న యా సేనాప్రవాహము వల్మీకమునఁ బ్రవేశింపఁబోవుచున్న ఘోరాహివలెఁ గన్పట్టెను. భాస్కరుఁడు నడిమింటి కెక్కెను. మార్గము శిలాకంటక భూయిష్ఠమగుటవలనను, మధ్యాహ్నమా ర్తాండుని కిరణపటలి యత్యుష్ణమై తాప మొదవించుట వలనను, మొగలు సైనికులు పరితాపవశులై, పాదుషా కార్యముఁ దలంచి పెదవి గదల్పక, యెట్టెటో దేహముల నీడ్చుకొని పోవుచుండిరి.

భాస్కరుఁడు చరమగిరి శిఖర మధిరోహించెను. నిజా న్వయ సంభవులైన మేవాడు భూవిభుల కనిష్టము గావింపఁ జను దెంచు నలంగీరు పాదుషాపైఁ బుట్టిన యాగ్రహాగ్నిచే నన్నట్లు లోకబాంధవుఁ డత్యంతారుణమూర్తి యయ్యెను. అప్పుడు విశ్వ సందర్శన కుతూహలియై గగనమండలమునఁ దోఁచిన నిశా నాథుఁడు దిననాథుని క్రోధము గని వెల్వెలనైనట్లు కళాహీనుఁడై యుండెను. అవివేకి హృదయమునం బలెఁ దమఃపటలము జగ మున నావరింపఁ జొచ్చెను. అనంతబ్రహ్మాండమున యం దందు గానవచ్చు విజ్ఞానజ్యోతులవలె నాకాశసీమఁ దారకలు పొడసూ

పెను. వర్ధమాన తమస్సంక్రాంతలోక నివాస మిచ్చగింపని పుణ్యపురుషునివలె సూర్యభగవానుఁడు పశ్చిమాంబుధి నిమగ్నుఁడయ్యెను. మొగలుసేన రాజపుత్రస్థానమునఁ గాలుమోపెను.

సేనా నివహ మంతయు లోయ నతిక్రమింపఁగనే పాదుషా కొండ పార్శ్వముననే పటకుటీరములు నిర్మింప నానతి యిచ్చెను. అనతి కాలములో దీపికా సహస్రము లుదయించి యా ప్రదేశ మందుఁ బండు వెన్నెలగాఁచెను. ఉదయపురీ సమేతుఁడై మొగలు రాజు నిజ శిబిరమునఁ బ్రవేశించెను.

అంతలో నొక వార్తాహరుఁ డత్యంత వేగమునఁ జక్రవర్తి విడిది కడకు వచ్చెను. ప్రతీహారుల వలన నతని రాక యెఱింగి చక్రవర్తి యాతనిని శీఘ్రముగాఁ బ్రవేశపెట్టించెను. అతఁడు వచ్చి చక్రవర్తికి జోహారొనర్చి యిట్లు విన్నవించెను. 'మహాప్రభూ! రసపుత్రులు వచ్చుచున్నారు. 'విజయమో వీరస్వర్గమో! కాని వెనుకంజ వేయ'మని వారు ప్రతిన వట్టిరి. ఇంకొక జాములోపల వారిచ్చటికిఁ జేరుకొనఁగలరు.'

"రానిమ్ము! అగ్నిజ్వాలపైఁ బడు శలభము లిట్లే విజృంభించును. అయినను వారి సంఖ్య యెంతయో వివరించితివి కావు?"

"ఒక వేయిమందికి మించరు."

"అదేమోయీ! మన బలగములోఁ బదియవ పాలైనఁ గాని వారీ సాహస కృత్యమున కెట్లు కడఁగిరి?"

"ప్రభూ! మన మదృష్టవంతులము. కాని-చో నీ రసపుత్ర సైన్యము మనవారు లోయలో నున్నప్పుడే ముఖద్వారము నరి

గట్టియుండును. అప్పుడు మనవా రెందఱున్నను విక్రమించుట కవకాశము లేక వెనుకకు మఱలవలసి వచ్చెడిది. మనపై నెత్తివచ్చు రసపుత్ర సేనాపతి నవపరిగ్రహమగు కళత్రమును విడువనేరక కాలయాపన మొనర్చుట మనకు లాభకరమైనది."

"అతని భార్య యాత్మహత్యఁ జేసికొన్నఁదటకదా! ఆ వార్త యాతనికి దెలిసి వెనుకకుఁ బోలేదా!"

"ఈ రసపుత్రులు రణమన్నఁ బండుగుగా భావించు రాక్షసులు. ఇంట నున్నంతవఱకే భార్యాపుత్రులపై మమకారముండును గాని కదనోన్ముఖులైనపిమ్మట వారెవరో! వీరెవరో! దేవా! ఈ చిత్రము గమనింపుఁడు. ఈ సేనాని యుద్ధరంగములోఁ దనకు మరణము నిశ్చయముఁ జేసికొనియే బయలుదేఱెను. కాని తన మరణము విని భార్య సహగమనము చేయునో! చేయదో! యని శంకించెనఁట! ఇతని యీ యనుమాన మామెకుఁ దెలిసినది. వెంటనే తన శిరస్సు ఖండించికొన్నది. పరిచారకు లామె శవము నితని కడకుఁ గొనివచ్చిరి. ఈ సమాచారము విన్నంతనే యితఁడు మరణించునని యంద ఱనుకొనిరి. కాని భార్య శిరమును మెడలోఁ గట్టుకొని పిశాచమువలె నతఁడు యుద్ధరంగమునకుఁ బఱుగిడి వచ్చుచున్నాఁడు."

చక్రవర్తి యీ తుది వాక్యము విన్నంతనే విస్మితుఁడై "రసపుత్రుల భీకరాచారము లెన్నింటిని గూర్చియో మున్ను వినియుంటిని గాని యిట్టి యద్భుత పైశాచికకృత్యము విని యుండలేదు. లెమ్ము. లెమ్ము. మన వారలను యుద్ధమునకు సిద్ధ

పఱవవలెను.” అని వెంటనే ప్రధానులకు బిలిచి యీ సంగతిఁ దెలియఁ జెప్పెను.

ప్రధానులవలన యుద్ధమునకు నడపఁబడుచున్న సైనికులు తమ దాసజీవనమునకు దుఃఖించుచు గత్యంతరు మెఱుఁగక మోహరించి నిలిచిరి. ఇంతలో రసపుత్రసైన్యము వారిని సమీపించెను. రసపుత్ర వాహినినుండి సందేశహారుఁ డొకఁడు మొగలు చక్రవర్తిని దర్శించి 'నిశాసమయము నందలి యుద్ధము రసపుత్రుల కధర్మము. కాని మీరు నిలిచిన తావునుండి యడుఁగైనఁ గదలకుండఁ జూడవలసినదని మా ప్రభువుల యాజ్ఞ. సూర్యోదయ మగువఱకు మీ రిచ్చట విశ్రమింపవచ్చును. కాని కదలరాదు. ఇట్లని మా సైన్యాధిపతి నా ముఖమున మీకుఁ దెలియఁజేయు చున్నాఁడు.'అని వినిపించెను. చక్రవర్తి యతనిమాటలు వినుచు, వెనుకనుండి సైన్యసాహాయ్యము తమకు లభించు వఱకు రసపుత్రులీ నెపమునఁ గాలయాపన మొనర్ప నెంచిరని యభిప్రాయపడి, యీ సందేశహరునిఁ గన్నెఱ్ఱఁజేసి, “మతిహీనుఁడైన మీ సైన్యాధిపతి యలంగీరు పాదుషాగారి కిట్టి వార్త వినుచు మనుఁగాక! బ్రదుకఁ గోరినవాఁడవైన నీ విట్టి సందేశము మా కడకుఁ గొని వత్తువా!” అని సమీపవర్తులకుఁ గనుసన్న చేసినంతలో వా రా యభాగ్యుని శరీరమును రెండు తుండెము లొనర్చిరి.

ఈ యకార్య మెఱిఁగిన రామసింహుఁడు క్రోధోద్రిక్తుఁడై తనసైనికులకు యుద్ధమున కనుమతి యిచ్చెను. అంతకుఁ బూర్వమే రణమున కాయత్తమై యున్న మొగలు సేనా వ్యూహ

ము వారి నెదుర్కొనెను. రాత్రి యుద్ధ మధర్మము గనుక రస పుత్రులా సమయమునఁ దాము యుద్ధ మొనర్ప వలసివచ్చునని యెఱుఁగమి, వారి యొద్ద దీపికలు కొఱవడి యుండెను. మొగలు సేనలో మాత్రము పట్టపగట వలె దివ్వెల మొత్తములు వెలుఁగులు ప్రసరింపఁజేయుచుండెను. ఔరంగజేబు వ్యూహమున నిలిచి రసపుత్రుల నెదుర్కొనెను.

ఒక మహాసముద్రముతో సెలయేఱు కలహింపఁ దొఱఁకొనినట్లు రసపుత్రుల యల్పసేన మొగలు సేనతోఁ బెనఁగఁ జొచ్చెను. రామసింహుని కరవాలము మహా భుజంగము వోలె విజృంభించి శత్రువులకు మిఱుమిట్లు గొల్పుచుఁ గసిమసంగఁ దొడఁగెను. ప్రభుని విక్రమాటోపము గన్న రాజపుత్రవీరులు క్షుత్పీడితములైన బెబ్బులులు లేళ్ళపై దుమికినట్లు మొగలులపైఁ గవిసిరి. "హర హర మహాదే" వేతి నినాదములును, "అల్లాహో అక్బ" రితి శబ్దములును నవిరామముగా ధ్వనించెను. మృత్యు స్వయంవరమునకై సంసిద్ధులై వచ్చిన రాజపుత్ర వీరులు ఢిల్లీ సైనికులకు యమకింకరులుగాఁ జూపట్టిరి. కపాలధారియైన రామసింహుఁడు త్రిపురాసుర సంహారోద్యుక్తుఁడైన కపాలపాణివలె దుర్నిరీక్ష్యుఁడై విజృంభించెను. ఔరంగజీ బతని నెదుర్కొన యత్నించియు నతని యురముపై నర్తించు వాసంతికా ముఖబింబ మది తన గుండియ లవియఁ జేయఁ బలాయితుఁడగుచుండెను. తమ ప్రభుని భయోద్వేగ మరసిన మొగలు భటులు రణరంగము విడిచి నలుదెసలకుఁ బర్విడఁ జొచ్చిరి. రామసింహుఁడు వారిని గొండనెత్తమ్ములంటఁ దఱిమెను.

అప్పటికిఁ బూర్తిగాఁ దెల్లవాఱెను. భానుబింబము ప్రాచీశాకాంత ఫాలతలమునఁ గుంకుమబొట్టువలె మెఱసెను. ఔరంగజేబు శత్రు మిత్ర బలమును బరిశీలించెను. శత్రుబలములోఁ బదిమందిమాత్రమే యుండిరి. తనసేనలో సగము నశించినను శత్రుసంఖ్యకుఁ గొన్నివందల రెట్లుండుటచే మహాధైర్య ముద్భవించెను. వెంటనే తన మత్తేభము నతఁడు రామసింహునిపైఁ బురిగొల్పెను. రామసింహుఁడు తత్క్షణమే తన వారువమును విరోధి మీఁదికి దుమికించెను.

యజమానివలెనే యపరిచితభయ మగు నా యశ్వరాజము భీకరముగా సకిలించి తన ముంగాళ్ళెత్తి శత్రుగజము కుంభస్థలమునఁ బ్రతిష్ఠించెను. ఆ కుంభి యీ యాకస్మిక చిత్రసంఘటనమునకు భయవివశమై, బ్రమాన్పడెను. పాదుషాకు నోటమాటలేదు. అతని చేతినుండి కరవాలము నేలఁబడెను. రామసింహుఁడు తన భల్లముఁ జక్రవర్తి వక్షస్థలమునకు గుఱిపెట్టెను. మొగలు భటులు భయవిభ్రాంతులై హాహారవము లొనర్చిరి. దైన్యదేవత మూర్తీభవించినట్లు ఢిల్లీచక్రవర్తి యాపాదమస్తకము కంపించుచుండఁ బ్రాణములపై నాశవదలలేక 'చంపుదువా! చంపుదువా!' యని గద్గదకంఠుఁడై యడిగెను. తత్రత్య వీరభటనికాయము రామసింహుని మొగమునఁ జూడ్కులు నిలిపి యతని ముఖలక్షణములఁ బరీక్షించుచుండెను.

రామసింహుఁ డంతట నిట్లు పలికెను. ''ఓయి హింసామూర్తీ! నీ నిమిత్తమై, నీ యధర్మవాంఛాఫలసిద్ధి కొఱకై, యెందఱి జీవములను దగ్ధమొనరించితివో చూచితివా! తుదకు నీ

ప్రాణములకు ముప్పు తలపెట్టి పరగాం జంపు టధర్మముగాం దోచు చున్నదా! బలవంతుండనుగదా యని గర్వోన్మత్తుండవై బలహీనుల శిరస్సులు కేళికందుకములు గావించి విహారమొనర్చు నీకు నేండు కనువిప్పు కలిగెనా! పాషండుండా! మతవిభేదము పేర నన్యమతస్థుల ప్రాణములు తృణప్రాయములుగాం జూచి హింసించుచున్నావే! ఈ సార్వభౌమత్వము, నీ బలాధిక్యము, నీ విశృంఖలవాగ్ధాటి జనసమ్మతము జిరకాల మిట్లే చెల్లునని విశ్వసించితివే! చూడుము. నా వారు పదిమందికన్న నెక్కువలేరు. నీ సైనికులై దారువేల మంది యున్నారు. కాని నీ ప్రాణము లీ క్షణమున నా యధీనమందున్నవి. తలంచుకొన్నచో నీ శరీర మిప్పుడు కాకులకు గ్రద్దలకు భక్ష్యము గావింపంగలను. కాని యుదయపురి యెట్టిదైనను మావంశమునం బుట్టినదిగనుక నాకు సోదరి. ఆమెకు వైధవ్యము గల్పింప మనసొప్పక యింత తడ వాలసించితిని. ఇప్పుడు నా కొక మాట చెప్పుము. ఈ నీ గతప్రవర్తనమునకుం బశ్చాత్తాప ముదయించినదా! ప్రాణము లుండంగా రాజపుత్రస్థాన మొక్కటియే కాదు; ఏయితర ప్రాంతముపైనైనను నీవు దండెత్తకుందువా? రాజ్యపాలనమున హిందూమహమ్మదీయ భేదముసూపక సమదృష్టితో వ్యవహరింతువా? దేవాలయములం గూలంద్రోయింపకుందువా? జిజియాపన్ను మాన్పింతువా? చెప్పుము. సమాధానము చెప్పుము. ఆలసించితివా! నీ ప్రాణవాయువు లిప్పుడే యంతరిక్షమున కెగిరిపోంగలవు."

ఢిల్లీశ్వరుం డా పలుకులు విని నోరున్నం దలంగాచునని మెఱంగి దీనముగా నిట్లు పలికెను. "వీరుండా! ఇట్లు నిర్భయము

గా నాకు హితోపదేశ మొనరించినవాని నింతవఱకు నేఁ జూడ లేదు. నీ పలుకులవలన నాకు జ్ఞానోదయ మైనది. గతించిన దానికి నేను మిప్పులఁ జింతించుచున్నాను. నీవు కోరినట్లే నేఁటి నుండి నా జీవితముఁ బరహింస లేని పావన పథముఁ బట్టించెదను. సత్కార్యాచరణమునకై మాత్రమే నేను బ్రదుకఁ గోరుచున్నాను గాని ప్రాణములపై నాశవలనఁ గాదు."

అప్పుడు రామసింహుఁడు "మంచిది. బ్రదికితివి. ఇఁక నింటిదారిఁ బట్టుము. బుద్ధికలిగి ప్రవర్తింపుము." అని హాయ మును బుజగింపఁగా నదియు యజమాని మాన సెఱిఁగి కుంభికుంభ స్థితములైన పాదములను క్రిందికి డించెను. రామసింహుఁడు సానందుఁడై, తనవారిని జూచి 'శూరులారా! భగవదనుగ్రహ మున స్వామి కార్యము నిర్వర్తించి కృతార్థులమైతిమి. మీరు స్వామిని సందర్శించి మన విజయగాథ వినిపింపుఁ' డనుచున్నంత లోఁ బాదుషా కనుసన్న నెఱిఁగి మహమ్మదీయ భటుఁడొకఁడు తన బల్లెమును రామసింహుని వెన్ను జీల్చుకొని పోవ విసరెను. ప్రమత్తుఁడైన రామసింహుఁ డట్లు భల్లనిహతుఁడై నేలఁ గూలి గమనోన్ముఖములైన యసువు లొక్కింత నిలిపి 'మిత్రులారా! త్వరపడుఁడు. త్వరపడుఁడు. ఈ గోముఖ వ్యాఘ్రము తా నాడిన మాటఁ దప్పఁదలఁచినది.' అని మెలుగెత్తి పలికి, పార్శ్వమునఁ బడియున్న వాసంతికా ముఖము నిజ ముఖ సమీపమునకుఁ జేర్చుకొని 'వా సం తి కా! వా...సం...తి...కా!' యనుచు, బాష్పధారల నభిషేకించి త్రి మూర్త్యాత్మకమైన భాను బింబ మునఁ జూడ్కి నిలిపెను. తదనంతర మొక్క నిముసములో నతఁడు

తుచ్ఛమైనన శరీరముఁ బరిత్యజించి, దివ్యమూర్తియై రవి మండలము భేదించుకొని వీర స్వర్గమునఁ దనకొఱకై వేచియున్న వాసంతికాదేవిని గలిసికొనెను. రామసింహుని యీ హఠాన్మరణము దిలకించి యతని మిత్రులు పాదుషాపైఁ గవిసిరి. కాని యతఁడు జాగరూకుఁడై తన బలమును మున్నిడుకొని వారి ప్రతాపాగ్నికిఁ దనసైనికుల కెఱఁ జేయుచు మృత్యువుఁ దప్పించుకొని వెక్కిరించెను. రసపుత్రు లసువు లున్నంతవఱకు రిపులఁ జెండాడి వీరస్వర్గ మలంకరించిరి.



## ౧౨

పాదుషా యట్లు కుటిలోపాయమున రామసింహుని సంహరింపించి విజయోత్సాహియై యుదయపురిని సందర్శింప నరిగెను. అట మాధురి సర్పదష్టయై పరలోక ప్రయాణమునకు సన్నద్ధురాలగుచుండెను. తన ప్రియ దాసికిఁ గలిగిన యీ విపద్దశకు వగచుచు నుదయపురి బహువిధములఁ జికిత్స లొనరింపించియు ఫలము గానక కన్నీళ్లు విడచుచుండెను. పాదుషా యీ దృశ్యముఁ గాంచి యచ్చోటకుఁ బోవ నుత్సహింపక కుటీరమున కీవల నిలిచియుండెను.

మాధురి పలుకు లిట్లు వినిపించెను. "దేవీ! నిజముగా మనము మన జాతికిని, దేశమునకును, మహాద్రోహ మొనరించితిమి. మన మపమార్గమునఁ బడినది చాలక మనశక్తులన్నియు

మన సోదరీ సోదరులను నయభయముల వంచించి, మనవలెనే భ్రష్టులఁ గావింప యత్నించితిమి. మన యైశ్వర్యమును, మన యధికారమును నాచంద్రార్కము గా నిలువఁబడు ననుకొంటిమి. కాని వాసంతికను జూడుము. ఆమె మనకంటె నెంతో చిన్నది యైనను వివేకమున మనకుఁ బెద్దయైనది. ఎట్టి ప్రలోభమునకును వశపడక తన కన్ని తెఱఁగుల నీడైన రామసింహునిఁ జేపట్టినది. ధీరోదాత్తుఁడైన యతనిని దన సుగుణసంపదచే లోఁగొన్నది. పాపాత్మురాలనై, నే నామెకు లేనిపోని మాటలు చెప్పి, యామె మనసు నొప్పించితిని. నిర్మలమైన యామె పతిప్రేమకు విఘాతము గల్పింప నెంచితిని. పత్న్యేకజీవన యామె పతి మనస్తృప్తిని, నతని శ్రేయస్సును, దేశహితమును వాంఛించి త్రుటిలోఁ దన శిరస్సు ధర్మదేవతకుఁ బూజా పుష్పముగా నర్పించినది. తనూబల మనో బలములు రెండును బరపీడనకే వినియోగించి చిరకాలము బ్రతుక నెంచిన నేనుగూడఁ జచ్చిపోవుచున్నాను. చేఁ జిక్కిన పాదుషా ప్రాణములను నీ మాంగల్యము నిలుపఁగోరి, సంరక్షించి, తుది నిముసము వఱకు ధర్మమూర్తియై, సాహసౌదార్యనిధియై, జీవించి రామసింహుఁడును, స్వామిఋణముఁ దీర్చి కీర్తిశేషుఁడైనాడు. కాని యీయువ్వురిలో, నా పుణ్యదంపతులకు, స్వర్గకవాటములు దెఱచి, దివ్య లాహ్వాన మర్యాదలు నెఱపి, శాశ్వతానందమయ జీవన మనుగ్రహించుచున్నారు. ఇఁక నేనా! భయంకర కాలకింకర వికటాట్టహాస విదీర్ణహృదయ నగుచుఁ, గంటకపథములఁ బడి నరకమునకు బలాత్కారముగా నీడ్వఁబడుచున్నాను. అమ్మా! మరణాసన్నయైన యీ నీ చిరకాల సేవకురాలి యభ్యర్థన మంగీ కరించి నీ జీవితశేషముఁ బుణ్యమార్గమున నడపింపుము.

అమ్మా! అమ్మా! బాధ...బాధ... దేవీ!సె...ల...వు...
ఏ...క...లిం...గ...స్వా-మీ...”

పిమ్మట ‘మాధురీ! మాధురీ!’ యను నుదయపురి రోదనము వినవచ్చెను. పాదుషా కింకర్తవ్యతామూఢుఁ డగుచుఁ జేష్టలుడిగి నిలువఁబడి యుండెను.

ఇంతలో సైనికులలో ‘శత్రువులు, శత్రువు’లను కేకలు వినవచ్చెను. ఔరంగజీబు భయాశ్చర్యములతోఁ గన్నెత్తి పరికించెను. తన కెట్ట యెదుట మహాసైన్య మొకటి వియత్తలోద్ఘటనోత్తాలోర్మికామాలికాభీలమగు పారావారమువలె దృగ్గోచరమయ్యెను. అతఁడు భయోద్విగ్నుఁడై వెనుకకుఁ దిరిగెను. కులాచలోన్మూలనోదగ్రప్రళయఝుంఝు వడువున ధరాపరాగనలయము లాకసమంట మహా వేగమునఁ బఱతెంచు మఱియొకసేన దర్శన మిచ్చెను. అతని మనసు క్షీరసాగరమథనవేళాపరిభ్రమమాణ మందరాకులిత మయ్యెను. “పఱువెత్తుఁడు. పఱువెత్తుఁడు. బ్రతికియున్న బలుసా కేఱి తినవచ్చును. లోయలోఁ జొఱబడుఁడు.” అను హెచ్చరిక యతని వదనము నుండి బయల్వెడలెను. లోనున్న యుదయపురి యీ పలుకు లాలించి నంతనే సాధ్వసాతిరేకవేపమానతనూవల్లిక యగుచుఁ బఱువెత్తుకొని వచ్చెను. ఆ సార్వభౌముఁ డంతటఁ బ్రేయసిని జేతఁ బట్టుకొని మత్తగజమునకై నిరీక్షింపక, సమీపముననున్న సామాన్య హయముపైఁ గూర్చుండఁ బెట్టుకొని,లోయలోఁ బ్రవేశించెను. ‘యథారాజా తథాప్రజా’ యను న్యాయమున, ఢిల్లీ

సైనికులు ప్రభువు చూపిన త్రోవఁబట్టిరి. దండతాడనభయవినష్టధైర్య మగు కాకోదరమువలె మొగలుసేన లోయలోఁ బ్రవేశించెను.

ఇంతలోఁ బాదుషా కెదుటఁ గుమారసింహుని భిల్లసేన గోచరించెను. అది గిర్యగ్రము లధిరోహించి, తన్నుఁ గాటువైవ వచ్చుచున్న సముద్యతశరాగ్రజిహ్వాంచలోదగ్రకాల భుజంగమమువలెఁ గాన్పించెను. అతని కిఁక నాశాలేశము గూడలేక పోయెను. అతఁడంతట సైన్యమున కిఁక ముందడుఁగిడనలసినదని శాసించెను. సైనికులు హతమతులై ప్రభుని యభిప్రాయ మెఱుంగఁ దర్వరపడుచుండిరి.

ఇంతలో నొకబాణము సూటిగా నౌరంగజీబు చెవినఱకు వచ్చి క్రిందఁ బడెను. ఆ బాణపుఁ జివర నొక లేఖ కట్టఁబడి యుండెను. ఔరంగజీ బా లేఖఁ జూచి ప్రధానోద్యోగిని బిలిచి యందేమి లిఖింపఁబడెనో చదువు మనియెను. అతఁ డా లేఖ నిట్లు చదివెను.

ఔరంగజీబునకు,

మేవాడు మహారాజు రాజసింహుఁడు తెలియఁ జేయు లేఖాంశములు.

నీవు బలమదాంధుఁడవై గర్వించి ధర్మాధర్మములు మఱచి చరించుచున్నందున శిక్షార్హుఁడ వైతివి. ఈ లోయ

యే నీకుఁ గారాగృహము. ఇంక మేము నీతో యుద్ధమొనరింప వలసిన యవసరము లేదు. మీరు సాయుధులయ్యును, మీ యాయుధములు మాపైఁ బ్రయోగింపనేరని దుస్థితిలోనున్నారు. ఇట్టి మీపై నాయుధప్రయోగము మాకధర్మము. నీవు రాక్షసుఁడవై యుద్ధధర్మములుగూడ మఱచి వర్తించితివిగాక! మే మట్లొనర్పము. రామసింహు నన్యాయ్యముగఁ జంపించిన నిన్నెట్లు శిక్షింపవలయునని యడుగుచున్నారము. ఆలోచించి సమాధానమిమ్ము. ఇతరములైన నీనేరము లానల విచారింతుము.

ఇట్లు,

రాజసింహుఁడు.

(మేవాడు మహారాజు)

లేఖాంశము లాలకించి యౌరంగజీబు మండిపడెను. కాని చేయఁదగిన దేమియులేనందునఁ గోపము దిగమ్రింగి సైనికులను జూచి 'శత్రువులు మనపై నాయుధప్రయోగ మొనర్పరఁట. ఇట నుండి మనము తప్పించుకొను మార్గములేదు. మన యాయుధములు వారిపైఁ బ్రయోగించు నవకాశములేదు. సంధియే కర్తవ్యమని తోఁచుచున్నది. ప్రస్తుతము యుద్ధభయములేదు గనుక మీరందఱు విశ్రమింపుఁడు. భవిష్యత్కార్యక్రమముఁ జక్కఁగా నాలోచించి నిర్ణయింతము.' అనెను. సైనికులు 'నేఁటికి మృత్యువు దప్పిన' దని సంతోషించుచు భోజనాదికములకై ప్రయత్నము లొనర్పఁ దొడఁగిరి.

ఇ ట్లౌరంగజీ బా లోయలో మూఁడుదినము లాలోచిం చెను! అతఁడింకను నాలోచించెడివాఁడే. కాని తాను గొనివచ్చిన యాహారపదార్థము లంతరించినవి. అందుచే నాలోచన ముగింప వలసి వచ్చెను. అప్పు డతఁడు రాజసింహనరేంద్రున కొక సుదీర్ఘ లేఖ రచించి యొకదూతచేఁ బంపెను. అందుఁ దాను గతించిన దానికి బశ్చాత్తాపపడుచున్నట్లును, దన జీవితము రాజపుత్రుల కరుణపై నాధారపడి యున్నట్లును దెలిపెను. పిమ్మట రాజసిం హుఁ డతనినుండి విశేషధనము నష్టపరిహారముగా గ్రహించి 'యింక నెన్నఁడు రాజపుత్రస్థానమున నడుఁగిడ' ననిపించుకొని, విడిచి పెట్టెను. చావు దప్పి కన్ను లొట్టవోయినట్లు హతశేష పరివారముతో మొగలుచక్రవర్తి ఢిల్లీకిఁ బోయెను.



# ఉపసంహారము

ఔరంగజేబు నిట్లు కోఁతులాడ్చిన త్రాచువలెఁ జేసి సాగనంపి, రాజసింహ మహారాజు సపరివారముగా నుదయపురమును జేరెను. తమ మహారాజు విమలాదేవితో విజయలక్ష్మినిఁగూడఁ జేపట్టినందులకుఁ బ్రజ లత్యానందభరితులైరి. ఒక్క యుదయపురమునసేకాక, రాజపుత్రస్థానమంతట విజయోత్సవములు జరిగెను. ఆ విజయోత్సవములో వాసంతికా రామసింహులు లేకపోయిరని విమలా రాజసింహులుఁ, కుమారసింహుఁడు కడుంగడు దురపిల్లిరి. గురుదేవుఁడు వారి నోదార్చి, వాసంతికా రామసింహులఁ గూర్చి విచారించుటకంటె, వారి దివ్యనామములు జగమున శాశ్వతమగునట్లు చేయుటయే కర్తవ్యమని ప్రబోధించెను. అట్లే మహారాజా పుణ్యదంపతుల చిత్రపటములు లిఖింపించియుఁ గవులచే వారి పవిత్ర జీవిత మత్కురూపమున విలసిల్లఁ జేసియు గుర్వాదేశముఁ బాలించెను. రాజపుత్రస్థానమం దచిరకాలముననే వాసంతికా రామసింహుల దివ్యచారిత్రము చారణచారిణీ సంస్తూయమానమై, విలసిల్లినది. దివ్యకీర్తిమూర్తులై వాసంతికా రామసింహు లీనాఁటికిని రాజపుత్రస్థానమున స్వధర్మరక్షాదీక్షను బ్రబోధించుచునేయున్నారు. వాసంతికవంటి యువతు లీ లోకమున నెంద ఉదయించినారు? లేరు. ఇతరవిధముల నెందఱెంతగాఁ బ్రశస్తిఁ గాంచినవారు కలరుగాక! ఆమెకు సాటియైనవారు మాత్రము లేరు.

వాసంతికకు సాటి వాసంతికయే.

